3


# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯33.
సాలుచందా **1-8-0.**
సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౭. బహుధాన్య, ఫాల్గుణము : మార్చి, 1939. సంచిక : ౧.


# సంపాదకీయసమాలోచన

**౧. ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుని ఎన్నిక : కాంగ్రెస్ ఓటమి :—**

ఆంధ్రరాష్ట్రసంఘాధ్యక్షులు శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఆంధ్రవిశ్వవిద్యాలయపు సిసేటుకు సభ్యుడిగా నామినేషన్ అంగీకరిస్తారనీ, ఉపాధ్యక్షపదవికి పోటీసేస్తారనీ ఆ మధ్య పుకారుపురుషుడు చెబుతూవచ్చాడు. అందుకు ఉపబలంగా డిశంబరు మొదటివారంలో మద్రాసుదినపత్రిక ఒకటి వారు నామినేట్ అయారని ప్రకటించింది. మరునాటిపత్రికలు ఆ వార్త నిజముకాదన్నవి. మద్రాసుప్రధాని ఆంధ్రవిశ్వవిద్యాలయపు ప్రస్తుతాధ్యక్షుని తొలగించి ఆస్థానంలో ఏ పట్టాభినో పట్టాభిషిక్తుచేయాలని ఆతురత పడుతున్నట్లుకూడా వదంతులు వ్యాపించాయి. ఈపరిస్థితుల్లో ఈ నడుమ ఆంధ్రపత్రిక ఒకనాడు రివిన్యూశాఖామాత్యుని కార్యదర్శి శ్రీ తెన్నేటి విశ్వనాథం ఉపాధ్యక్షుని ఎన్నికకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘంతరపున నిలుస్తారని ప్రకటించింది. అప్పటికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయం త్రిపురిలోవుంది. ఆ సంఘ కార్యదర్శి ఈసారి ఉపాధ్యక్షుని ఎన్నికలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘం పాల్గొంటుందని ప్రకటించాడు. ఆ పైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షులు పట్టాభిగారు తమ కార్యదర్శి ప్రకటనను రద్దుచేస్తూ ఈ ఎన్నికల్లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘం పాల్గొనదని ప్రకటించారు. ఇంతలో శ్రీ తెన్నేటి విశ్వనాథం తాను ఆ ఎన్నికకు నిలిచేదిలేదనీ, తనకుబదులు శ్రీకోటిరెడ్డిగారు నిలుస్తారనీ, అందరూ ఆయన విజయానికితోడ్పడాలనీ ఒక ప్రకటనచేశాడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘకార్యదర్శి శ్రీకోటిరెడ్డిగారి అభ్యర్థిత్వాన్ని సమర్థిస్తూ ప్రకటించాడు. ఆ వెనుక పట్టాభిగారుకూడ సమర్థించారు. హఠాత్తుగా శ్రీ కోటిరెడ్డిగారిని అభ్యర్థిగా నిలపడానికి నిశ్చయించామని శ్రీవారు ప్రకటించారు. కార్యదర్శిది ఒక ప్రకటన, ప్రెసిడెంటుది ఒక ప్రకటన, ఆ మీద ప్రెసిడెంటు కార్యదర్శి అభిప్రాయంలోకిజారడం – ఇదిఅంతాచూస్తే ఈ విషయాల్లో పెద్దవాడు ఎక్కడోవుండి వీరినిఇట్లా ఆడిస్తున్నాడని ద్యోతకంకావడంలేదా? అయితే ఇంతకీ ఆ పెద్దవాడు ఎవడు? మద్రాస ప్రధానిరాజాజీయా? మద్రాసు కౌన్సిలుమెంబరుగా శ్రీ సి. ఆర్. రెడ్డిగారు (ప్రస్తుత ఆంధ్రవిశ్వవిద్యాలయాధ్యక్షులు) రాజాజీని నిర్మొగమాటంగా విమర్శిస్తూవున్నారు. ప్రతిభాశాలిఅయిన రాజాజీకూడ సి. ఆర్. రెడ్డి విమర్శనధాటికి నిరుత్తరుడు కావలసివస్తూవుంది. ఇట్లు విమర్శించడమేకాకుండా సి. ఆర్. రెడ్డిగారు మద్రాసుప్రభుత్వం ఆంధ్రవిశ్వవిద్యాలయంపట్ల చూపుతూవున్న సవతి తల్లిప్రేమను ఎప్పటికప్పుడు బహిరంగపరచచున్నారు. కాగా అతిన్ని ఎల్లాఅయినా ఆస్థానంలోనుంచి తొలగించాలనేభావం రాజాజీకి కలిగివుండవచ్చు. అతడు పట్టాభిద్వారా ఈపని చేయించుకోవడానికి తలపడివుండవచ్చు. మన పట్టాభి రాజాజీ ఎట్లా చెబి

...ట్లా తలఆడిస్తూ ఈవ్యవహారంలో వేలుపెట్టివుండవచ్చు. వేలుపెట్టినందుకు తుదకు మాటదక్కలేదు.

**శ్రీ కోటిరెడ్డి ఓటమి సంతోషింపదగ్గ విషయం:—**

ఇద్దరూ రెడ్లే, ఇద్దరూ రాయలసీమవారే. రాయలసీమ ఆంధ్రవిశ్వవిద్యాలయపుటావరణములో లేకపోయినా ఆంధ్రవిశ్వవిద్యాలయం పుట్టినప్పటినుంచీ రాయలసీమవాసులే ఉపాధ్యక్షులుగా వుంటూవున్నారు. కాగా ఇపుడు సి. ఆర్. రెడ్డి, కోటిరెడ్డిగార్లలో ఎవరు ఉపాధ్యక్షులుఅయినా ఉత్తరసర్కారు ఆంధ్రులకు ఒక్కటే. కాని ఆంధ్రవిశ్వవిద్యాలయానికో? సి. ఆర్. రెడ్డిగారు వుండడం వుత్తమం. ఆయన భారతదేశమందలి విద్యావేత్తలలో మీనుమిగిలినవారు. విదేశమందలి విశ్వవిద్యాలయవిధానాలతో విశేషమైన పరిచయము గలవారు. మైసూరు సంస్థానంలో విద్యాశాఖాధికారిగా అనంతఖ్యాతిని ఆర్జించిన మహనీయులు. 1926 లో ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పడ్డప్పుడు ఉపాధ్యక్షులుగా వరింపబడినవారు. 1926 మొదలు 1930 వరకు ఆ ఆరంభదశలో ఆంధ్రవిశ్వవిద్యాలయానికి ఒకరూపాన్నిఇచ్చిన నిర్మాణచతురులు అట్టివారినికాదని ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షపదవికి ఎగబ్రాకతలంచడంలో శ్రీ కోటిరెడ్డిగారి అర్హత ఏముంది? ఏమీలేదు. అయినా రాజకీయాలకు ఈ విషయంలో ప్రశక్తిఇచ్చి శ్రీకోటిరెడ్డిగారిని శ్రీ సి. ఆర్. రెడ్డిగారిమీదికి శ్రీపట్టాభి ప్రభృతులు డీకొలిపారు. ఆంధ్రుల అదృష్టవశమున శ్రీకోటిరెడ్డిగారు ఓడిపోయారు. ఇది ఆంధ్రులందరూ సంతోషింపదగిన విషయం.

**తొర్రిగెడ్డ ప్రాజెక్టుకు మద్రాసు బొక్కసంలో డబ్బు లేదు:—**

ఇరిగేషన్ డిమాండునుకోరుతూ పబ్లిక్ వర్క్సు శాఖామాత్యుడు తొర్రిగెడ్డ ప్రాజెక్టునుగురించి మద్రాసు అసెంబ్లీలో చెప్పినమాటలు ఏమాత్రమూ ఆశాజనకంగాలేవు. తొర్రిగెడ్డ ప్రాజెక్టుయొక్క త్వరనిర్మాణపు ఆవశ్యకతను అతను గుర్తించాడు. తొర్రిగెడ్డగల మండలమైన తూర్పు గోదావరికి ఆ మంత్రి పలుసారులు పోయివచ్చాడు. అయినా కొత్తగా ఏమీ ఒలకలేదు. ఈయేటి రివిన్యూలో ఆ ప్రాజెక్టుకు ఫండ్సులేకపోయాయిట! మద్రాసు రాజధాని ఆర్థికస్థితి అనుమతించడంతోటే ఈ ప్రాజెక్టు నిర్మాణానికి తప్పకుండా పూనుకుంటారట! ఇట్లు శుష్కప్రియాలతో, శూన్యహస్తాలతో ఆంధ్రుల ఇరిగేషన్ ప్రాజెక్టులు స్వల్పమాత్రాలు అయినవికూడా జోకొట్టబడుతూవున్నాయి. ఈ విషయం తెలిసికూడా ఆంధ్రశాసన సభ్యులు మూకబధిరులై వున్నారు.

**త్రిపురిలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తీర్మానం:—**

త్రిపురికాంగ్రెస్సులో చర్చకు వచ్చేతీర్మానాల్లో భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణాన్నిగురించింది ఒకటి అన్నారు. జనరల్‌గా భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణాన్నిగురించేకాకుండా ప్రత్యేకం ఆంధ్రరాష్ట్రనిర్మాణాన్ని గురించికూడా ఒకతీర్మానం ప్రతిపాదింపబడుతుందన్నారు. రెండు తీర్మానాలకు ప్రతిపాదకులు బెంగాలీబాబులే. అధ్యక్షుని ఎన్నికకాలంలో తమకుచుక్క ఎదురుగావుండిన ఆంధ్రులపట్ల వంగదేశీయులకు ఇంతటి అభిమానం ఎందుకు కలిగింది? ఆంధ్రరాష్ట్రపుతీర్మానం అనే ఎరనుచూపి వంగదేశీయులు ఆంధ్రుల్ని తమ ప్రక్కకు ఆకర్షిద్దామనుకున్నారు. ఎన్నికకాలంలో తమిళులు, కర్ణాటకులు, మళయాళీలు తమకు అనుకూలంగా వున్నారు. ఆంధ్రులు ప్రతికూలంగా వున్నారు. ఇపుడు ఈ తీర్మానం తెచ్చినట్లు అయితే ఆంధ్రులుకూడా తమ పక్షానికి వస్తారు అని వంగదేశీయులు ఆశించారు. కాని తుదకు ఏమైంది? లోగడ తమ పక్షాన్నివున్న అరవలు, కన్నడులు, మళయాళీలుకూడా కాంగ్రెస్ ఓటింగు సమయంలో తమకు ఎదురు తిరిగారు. ఇక ఆంధ్రుల్ని బుజ్జగించవలసిన అవసరం వంగదేశీయులకు లేకపోయింది. కాగా భాషాప్రయుక్తరాష్ట్ర తీర్మానంకాని, ప్రత్యే

ఆంధ్రరాష్ట్ర నిర్మాణతీర్మానంగాని కాంగ్రెస్‌లో స్మరణకైనా రాలేదు.

౯. త్రిపురి కాంగ్రెస్‌లో ఆంధ్రుల పార్టు అంతంత అయింది:—

త్రిపురికాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికలో ఆంధ్రునికి పంగనామంఅయింది. పోనీ ఆ కాంగ్రెస్ వ్యవహారాల్లోనేనా అతడు మంచి పార్టుతీసుకుంటాడేమో అని అనుకున్నాము. కాని అక్కడి తీర్మానాల ప్రతిపాదకుల్లో కాని, చర్చించినవారిలో కాని ఆంధ్రులకు మంచిభాగం లేకపోయింది రంగా, కాళేశ్వరరావు, అన్నపూర్ణయ్య, పట్టాభి, తిరుమలరావు, భయంకరాచారి మున్నగు ఆంధ్రులు మాట్లాడారుకాని మన పొరుగువారైన రాజాజీ సత్యమూర్తి ప్రభృతులగు అరవలపార్టుతో మనవారిపార్టు సహస్రాంశమైనలేదు. ఫెడరేషన్‌ను ఎల్లగేనా ఒప్పుకుందామంటూవచ్చిన సత్యమూర్తి త్రిపురికాంగ్రెస్‌లో పెద్దవాడై సుభాష్‌మీద అభిశంసన తీర్మాన ప్రతిపాదనకు మొనగాడు అయాడు. మనవారు గట్టిగా మాట్లాడడానికికూడా భయపడ్డారు. నలుగురిలో సిగ్గుపడే—పెద్దలంటే మొగమోటపడే ఇట్టి కాంగ్రెస్-ఆంధ్రనాయకులా మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని సంపాదించిపెట్టేది?

౯. రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటు: గ్రామవాసులకు సౌకర్యము:—

రైతులకు ప్రత్యేకసంబంధంగల డిపార్టుమెంటులలో రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటు ఒకటి. ఇప్పటి ప్రభుత్వ విధానంలో తాలూకాకు ఒకటి, ఒక్కొక్కచోట రెండుకంటె రిజిస్ట్రేషన్ ఆఫీసులు లేవు. రైతులు కా తాల రిజిస్ట్రేషన్‌కువచ్చి ఆయా ఆఫీసులలో పడేకష్టాలకు లెక్కలేదు. మదరాసు అసెంబ్లీలో రిజిస్ట్రేషన్ డిమాండు సందర్భంలో శాసనసభ్యులు ఈ విషయాన్ని పేర్కొన్నారు. అందుమీద ఆ శాఖామాత్యుడు రిజిస్ట్రేషన్ విషయంలో గ్రామవాసులకు సౌకర్యంకలిగించేవిధానం ప్రభుత్వమువారి ఆలోచనలోవుందని తెలిపాడు. ఆ విధానం ఎంతత్వరలో అమల్లోకివస్తే రైతులకు అంతమంచిది. కావున ప్రభుత్వం ఈవిషయంలో త్వరకార్యాచరణకు కడగునుగాక!

౯. విశేషమైన ఆందోళనకు కారణమైన అమ్మకంపన్ను:—

మద్రాసు ప్రభుత్వంవారు తలపెట్టిన అమ్మకంపన్ను విశేషమైన ప్రాతికూల్యాన్ని రేపింది. 1930-దరిమిలాను ప్రపంచాన్ని అంతా ఆవరించిన ఆర్థికమాంద్యం ఈదేశంలో ముఖ్యంగా రైతులమీద దెబ్బతీసింది ఆ దెబ్బకు తట్టుకోని ఈ రాజధానిలోని రైతులు మళ్లీ మామూలుబాటలో పడుతూవుండేస్థితిలో వారికి ఏదో ఉపకారం చేస్తామనేమిషతో మద్రాసుప్రభుత్వం రైతుఋణసహాయచట్టాన్ని కొనివచ్చింది. ఆ చట్టం రైతులకు కొంతవరకు సహాయంచేసిందికాని వర్తకులకు, పెట్టుబడిదారులకు విశేషంగా నష్టాన్నికలిగించింది. ఆ నష్టంచాలనట్లు ఇపుడు 'అమ్మకంపన్ను' ఒకటి విరుచుకుని వారిమీదపడుతూవుంది. రాజధానిమొత్తంమీద ఈ పన్నువిషయంలో కలిగిన ప్రాతికూల్యం కొలదిఇడరానిది అయినా మద్రాసుప్రధాని ఈ ప్రాతికూల్యాన్ని పరిగణించలేను. ఈ పన్నును విధించితీరతానని చేయెత్తిచెప్పినాడు.

౯. రాజాజీకి తోడి మంత్రులంటే అలసభావంవుంది:—

రాజాజీతోడి మంత్రుల్ని గురించి అలసభావంకలవాడనే విషయం పత్రికల ముఖతా తెలుసుకుంటూనే వున్నాము. ఆమాట మొన్న రాజాజీ ముఖతాకూడ మనం వినకలిగాము. అమ్మకం పన్నువిధించడాన్ని సమర్థిస్తూ ఇటీవల అతడు ఒక బహిరంగసభలో తనతోడి మంత్రులు ప్రభుత్వం కొత్తగా తలపెట్టిన పన్నుల్ని సమర్థిస్తూ మాట్లాడ్డానికిజంకి ఇతరవిషయాల్ని గురించి మాట్లాడుతున్నారనీ, ఆమాట్లాడడమైనా అందరికీ తెలియనిభాషలో మాట్లాడుతున్నారనీ ఈసడించాడు. తోడిమంత్రులపట్ల ఇట్టి అలసభావం వుండడమే కాద

అతడు తరుచు తోడిమంత్రుల్ని తాను రాజీనామా ఇస్తానంటూ భయపెడుతూవుంటాడనికూడా వింటాము. తోడిమంత్రులికేకాక మొన్న అతడు ఈభయాన్ని రాజధానికంతటికీ పెట్టాడు. అమ్మకంపన్నుకి అంగీకరించకపోతే తాను రాజీనామా ఇస్తానన్నాడు. ఇట్లా భయపెట్టి ప్రభుత్వంచేయడం ప్రజాస్వామికమేనా?

**కాంగ్రెస్ అంటు ఒక్క ఆంధ్రవిశ్వవిద్యాలయానికేనా?**

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘం ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుని ఎన్నికలో పాల్గొన్నది. అట్లాగే అవకాశంవచ్చినప్పుడు తమిళరాష్ట్ర కాంగ్రెస్‌సంఘం అన్నామలై యూనివర్సిటీ ఉపాధ్యక్షుని ఎన్నికలోనూ, ఆంధ్రతమిళరాష్ట్ర కాంగ్రెస్‌సంఘాలు మద్రాసు యూనివర్సిటీ ఉపాధ్యక్షుని ఎన్నికలోనూ పాల్గొని అభ్యర్థుల్ని నియమిస్తాయా? లేక ఈ విధానం ఒక్క ఆంధ్రవిశ్వవిద్యాలయంపట్లనే పరీక్షింపబడ్డట్లు ప్రకటింపబడుతుందా? ఆంధ్రయూనివర్సిటీమీద ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘాన్ని ఉసికొల్పి తెరవెనక భాగవతం ఆడుతూ కులుకుతూవున్న ఆసామీ ఎవరో బాధ్యతగల ఆంధ్రకాంగ్రెస్ పెద్దలు ఇప్పటికేనా బయలుపెడితే బాగావుంటుంది.

***. ఈపద్ధతి ఇతర జిల్లాబోర్డులుకూడ అవలంబింపతగింది:—**

వయోజనుల్లో నిరక్షరాస్యతా నిర్మూలమునకుగాను లూధియానాజిల్లాబోర్డువారు అవలంబిస్తూవున్న విధానం ప్రశంసనీయంగావుంది. ప్రతి ఉపాధ్యాయుడున్నూ వయోజనుల్లో నిరక్షరాస్యతానిర్మూలనం చేయడానికి పూనుకోడానికి ప్రోత్సాహంకలిగింపబడింది. కొద్దిపాటి లెక్కలుచేయడం, వ్రాయడం, చదవడం ఒక వయోజునికినేర్పిన ఉపాధ్యాయునికి జిల్లాబోర్డువారు ఆరురూపాయిల బోనస్సుయిస్తారు. ఒక్కొక్క ఉపాధ్యాయుడు కనీసం ఐదుగురువయోజనుల్నేనా విద్యావంతుల్నిచేయాలి. అట్లా చేస్తేనే బోనస్సుఇస్తారు. రొక్కరూపకమైన ప్రతిఫలంవస్తూవుంది కాబట్టి ఉపాధ్యాయులు ఈ పనిని చేయడానికి కుతూహలపడతారు. విద్యనేర్చుకుందామనే కుతూహలంవున్న వయోజనులే ఆ ఉపాధ్యాయులవద్ద విద్యార్థులుగా చేరుతారు కాబట్టి విద్యాగ్రహణవిషయంకూడ లెస్సగానే ఉంటుంది. మొత్తముమీద నిరక్షరాస్యతానిర్మూలనానికి ఇది మంచిపద్ధతి. ఈపద్ధతి హిందూదేశంలోని ఇతర జిల్లాబోర్డులుకూడ అవలంబింపతగింది.

***. ఉచితమైన స్త్రీస్వాతంత్ర్యానికి ఒక ఉదాహరణము:—**

మన కార్మికశాఖామాత్యులు ఈ నడుమ భార్యాసమేతులై తిరువణ్ణామలై వెళ్లారు. తిరువణ్ణామలై దేవస్థానం దివ్యప్రసిద్ధికలది. అమాత్యులు ఆ దేవాలయంచూడడానికి వెళ్ళలేదు. అమాత్యుని అర్ధాంగి మాత్రంవెళ్ళి చూచివచ్చింది. ఈ విషయాన్ని ఆమె విందుసభలో ఇట్లు వ్యాఖ్యానించింది. "హరిజనులకు ప్రవేశానుమతిలభించేవరకు దేవాలయాలలోనికి పోయేదిలేదని నాభర్త వ్రతంపట్టాడు. నాకు చిన్నప్పటినుంచీ దేవాలయాలకు వెళ్ళడమంటే సరదా. తల్లిదండ్రులు నాకుఇచ్చిన శిక్షణఅట్టిది. అగుట పతిదేవుడు రాకపోయినా నేను ఇచ్చటి గుడికిపోయివచ్చినాను." ఉచితమైన స్త్రీస్వాతంత్ర్యానికి ఈ విషయాన్ని ఒక నిదర్శనంగా గ్రహించవచ్చు. పతిరానంతమాత్రంచేత ఆ ఇల్లాలు దేవాలయదర్శనాన్ని మానలేదు. ఇట్టి స్వల్ప విషయాల్లోనేనా వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ప్రదర్శింపలేనిచో భారతరమణి ఆధునికయుగంలో ప్రశంసనీయురాలు కాలేదు.

***. ఈసారి జనాభాసమయంలో భాషల్ని పట్టి లెక్కలు తీసుకోరా?**

1941-వ సంవత్సరంలో తీసుకోబడే జనాభాలెక్కల్లో భాషల్నిబట్టి లెక్కలు తీసుకోడాన్ని విరమిస్తా

[౩౮౮-వ పేజీ చూడుము

## దేశసేవాదీక్షలో దేహారోగ్యాన్నిగురించి ఆలోచించని జాతీయవీరుడ

# సుభాష్ కథలు

అది 1931–వ సంవత్సరం మార్చిమాసం. సుభాష్ చంద్రబోసు కాంగ్రెస్ మహాసభకు కరాచి వెళుతూవున్నాడు. అతని కంపార్టుమెంటులో మరి ఇద్దరు స్నేహితులు వున్నారు. కలకత్తానుంచి కరాచీకి చాలాదీర్ఘప్రయాణం. రైల్లో రెండుపగళ్ళూ, మూడురాత్రిళ్ళూ వుండాలి. ఈప్రయాణంలో ప్రతిపూటా తనకు, తనతోటిమిత్రులకు భోజనం సుభాషే వడ్డించేవాడు. భోజనాలు అయినతరవాత ఎంగిళ్ళు ఎత్తడం, కంచాలు కడగడం మొదలయిన పనులన్నీ సుభాషే స్వయంగా చేసేవాడు. అతని స్నేహితులకు ఇది కష్టంగా వుండేది. చాలాదూరం చెప్పిచూశారు. ఎంతచెప్పినా సుభాష్ వినిపించుకోలేదు. ఇది స్వల్పవిషయమే. కాని ఇది సుభాష్ సేవాపరాయణతను లెస్సగా నిరూపిస్తుంది. ఆత్మజీవితాన్ని పరార్థప్రవణంచేయడమే సుభాష్ కోరిక.

... ... ...

పరార్థప్రవణమైన బుద్ధేకాదు సుభాష్ నిర్మాణశక్తికూడ నిరుపమానమైనదే. ప్రిన్సుఆఫ్ వేల్సు ఇండియా వస్తుండేతరుణంలో అతడు బొంబాయిలో ఓడదిగేదినాన్ని భారతదేశంఅంతటా హరితాళం జరపాలని కాంగ్రెస్ ఆదేశించింది. ఆ ఆదేశాన్ని అనుసరించి కలకత్తా మహానగరం హరితాళానికి ఆయత్తమైంది. ఆ సంబంధమైన కార్యకలాపానికంతా కలకత్తాలో సుభాష్ నియంతగా నియమితుడయ్యాడు. అతని నిర్మాణకౌశల్యంచేత ఆనాడు అక్కడ ట్రాముకారులుకూడా నిలిచిపోయాయి. ఆనాడు కలకత్తామహానగరం కేవలం మృతులపట్టణంగా కనిపించిందన్నా అతిశయోక్తికాదు.

... ... ...

కార్యనిర్వహణంలో అతనికి విసుగు, విరామం అనేదిలేదు. పని పడినపుడు అతడు ఇదిరాత్రి,పగలు అనే వివక్షతలేకుండా పనిచేస్తాడు. సూర్యోదయం మొదలు చుక్కపొద్దువరకూ, వొక్కొక్కప్పుడు అర్థరాత్రివరకూ అతడు ప్రతిదినం దినాలవెంట పనిచేస్తూనే వుండగలడు. ఒకనాటి ఉదయాన్ని పని ప్రారంభించి అదిచేసే కుతూహలంలో మర్నాడు తెల్లవారగట్ల రెండు గంటలవరకు అతడు భోజనం మరిచిపోయిన ఘట్టాలువున్నాయి. ఇంత పని చేస్తున్నా అతనికి విసుగు అనేదివుండదు. అహంభావంలేకుండా ఎవరికైనాసరే అతడు దర్శనమిస్తాడు. ఓరిమిలో, సహనబుద్ధిలో భార
నాయకులలో మహాత్మునితరువా
సుభాషే పేర్కొనదగినవాడు. ఓ
మి, సహనశక్తివున్నంతమాత్రంచే
అతనివద్ద నిరంకుశత, నిర్దయత
వని అనుకోకూడదు. అతడు ప
శుద్ధవర్తనుడు, ఇంతవరకు అవివా
హితుడు.

... ... ...

సుభాష్‌ది సుందరవిగ్రహం.
దుఅడుగుల తొమ్మిది అంగుళా
ఎత్తయినమనిషి. చిన్నది, పొ
గైనది అయిన నాసిక. సునిశి
మైన చూపుగలకళ్ళు. అనువై
ఆకారాన్ని పొంది అతిసుకుమారమై
న అతనిచేతివేళ్ళు అతని భావా
త్వాన్ని సూచిస్తాయి.

... ... ...

రెండేళ్లకుపూర్వం ఇండియ
కార్యదర్శి లండన్‌లో హౌస్ ఆ
లార్డ్సులో మాట్లాడుతూ సుభా
ను అఖిలోకప్రతిభాశాలిగా పేర్కొ
న్నాడు. వృద్ధకాంగ్రెస్‌నాయకు
వదిలేస్తే యువకుల్లో ఆపాటివా
లేడని మనం అంగీకరించకతీరదు.

... ... ...

ఏభై రెండేళ్ళుగల కాంగ్రెస్
సుభాష్ మిక్కిలి చిన్నతనంలో
అధ్యక్షుడు అయ్యాడు. హరిపు
లో అతడు అధ్యక్షస్థానంవహిం
సరికి నలభై ఏళ్ళవాడు. 1905 ల
కాశీకాంగ్రెస్‌కు అధ్యక్షత వహి
చేసరికి గోఖ్లే ముప్ఫయితొమ్మి

ఏళ్ళవాడు. 1897 లో అమ్రోతి కాంగ్రెస్‌కు అధ్యక్షతవహించేసరికి శంకరన్‌నాయరు నలభై ఏళ్ళవాడు. సుభాష్‌చంద్రబోసుకూడ నలభయ్యోయేట కాంగ్రెస్ అధ్యక్షుడు అయ్యాడు. ఆవేశవిషయంలో సుభాష్ యువకుడే. ఆరోగ్యవిషయంలో అతణ్ణి ముసలివాడు అనాలి. కీర్తిశేషుడు దేశబంధుచిత్తరంజనదాసు సుభాష్‌బోసునుగురించి 'యువకవృద్ధుడు' అంటూవుండేవాడు.

... ... ...

దేశంకోసం అతడు ఐ.సి.యస్. పట్టాన్ని అలవోకగా తిరస్కరించాడు. కష్టాల్ని వరించాడు. గత పదహారు ఏళ్ళల్లోనూ అతన్నితొమ్మిదిసారులు ఎరస్టుచేశారు. రాజకీయజీవితంలో ప్రవేశించి నప్పటినుంచీ అతనిజీవితం రాజకీయబందీగానో, డిటెన్యూగానో, యూరప్‌లో ప్రవాసిగానో జరిగిపోతూ వుంది.

... ... ...

సుభాష్ స్వార్థత్యాగం నిరుపమానమైంది అని తెలిపివున్నాం. ఆ గుణం అతనికి చిన్నప్పటినుంచీ వుండేది. విద్యార్థిదశలో అతడు ఎన్నోసారులు తన పైమీదిబట్టను పేదవాళ్ళకు దానంచేసిన ఘట్టాలు వున్నాయి. విద్యార్థిదశలోనే అతడు కొందరు యువకుల్ని కూడగట్టి రోగిష్ఠివాళ్ళను శుశ్రూషచేసే నర్సులుగానూ, అనాథశవాల్ని శ్మశానాకి కొనిపోయే ఉదారులుగానూ తయారుచేశాడు.

... ... ...

ఇన్నేళ్లువచ్చినా సుభాష్ అవివాహితుడుగానే వున్నాడు. అతనికి వివాహాన్నిగురించిన తలంపే లేదు. ఒకసారి అతనిస్నేహితుడు సుభాష్ వివాహం చేసుకోకపోవడానికి కారణం అడిగాడు. దానికి సుభాష్ ఇట్లా సమాధానం ఇచ్చాడు. 'ఒకపురుషుని జీవితంలో వివాహం ఒక్కటే ప్రధానమైందని నీతలంపా? నాభావం అదికాదు. వివాహంకంటె ఉత్తమమైనవీ, విలువఅయినవీ అయినపనులు ఈలోకంలో చేయడానికి ఇంకావున్నాయి.' అందుమీద ఆ మిత్రుడు నిరుత్తరుడు

అయ్యాడు.

... ... ...

సుభాష్ దస్తూరీ చాలా బాగా వుంటుంది. సుభాష్ తాను వ్రాసే వుత్తరాలన్నీ స్వయంగా వ్రాస్తాడు. తన కార్యదర్శిచేత వ్రాయించడం కాని, టైప్‌రైటరు సహాయాన్ని పొందడంకాని చేయడు. ఉత్తరాలన్నీ స్వయంగా వ్రాయాలనేనియమం ఉండడంచేత సుభాష్ తనకు వచ్చే ఉత్తరాలకు అన్నిటికీ వెంటవెంటనే జబాబు ఈయలేక పోతూ వుంటాడు. అతని ఆఫీసురూములో టేబల్‌మీద అతని పరిశీలనాన్ని కోరుతూ వందలకొద్దీ ఉత్తరాలు ఎప్పుడూ పడివుంటాయి.

... ... ...

సుభాష్ దేశభక్తి ఎనలేనిది. 1927 లో అతడు మాండలే జయిలునుంచి విడుదలపొందాడు. ఆ విడుదలకు కారణం అతని అనారోగ్యమే. విశ్రాంతి తీసుకోవలసిందిగా డాక్టర్లు అతనికిసలహాఇచ్చారు. కాని సుభాష్‌నిఘంటువులో విశ్రాంతి అనేదిలేదు. విడుదలపొందినవెంటనే అతను పాట్నా వెళ్లాడు. అక్కడ వొక ఉపన్యాసంలో 'రోగగ్రస్తులం కావడానికికూడా మనకు అవకాశంలేదు' అని చెప్పాడు.

... ... ...

చిన్నప్పటినుంచీ సుభాష్ తెంపరితనంతోకూడిన వీరత్వానికి పేరుమోసినవాడు. అతడు బియ్యే చదువుతూవుండగా కాలేజీ లెక్చరర్ ఓడెన్‌దొర వొకసారి బెంగాలీవాళ్ళనుగురించి ఈసడిస్తూ మాట్లాడివున్నాడు. దానికి విద్యార్థులు చాలా ఖేదపడి తమనిరసనాన్ని తెలియచేశారు. లెక్చరర్ మనస్సు మార్చుకోలేదు. ఆ సందర్భంలో కాలేజీ వీడవలసివచ్చిన వారిలో సుభాష్ వొకడు. అందుకు యూనివర్సిటీ అధికారులు అతన్ని రెండేళ్లు కళాశాలవిద్యనుండి నిషేధించారు. క్షమాపణఇస్తే వెంటనే తిరిగి కళాశాలలో చేర్చుకొనివుందురు. కాని తప్పు తనది కానప్పుడు క్షమాపణ ఇవ్వడం ఆత్మగౌరవానికి భంగమనిసుభాష్ యిచ్చేతలంపు పెట్టుకోలేదు.

... ... ...

1926 లో అనారోగ్యకారణంచేత అతణ్ణి మాండలే జయిలునుండి విడుదలచేశారు. మే 15-వ తేదీ మధ్యాహ్నం పండ్రెండు గంటలికి అతణ్ణి కలకత్తా స్టీమరుమీద తీసుకువస్తారనేవార్త కలకత్తాలో తెలియవచ్చింది. కలకత్తా మహానగరంలోని పదమూడులక్షల జనులున్నూ వొక్కసారిగా సుభాష్‌దర్శనంకోసం హార్బరువద్దకు వెళ్ళారు. పదకొండుగంటలకు స్టీమరు నదిమధ్యలోవుంది. ఆ స్టీమరులోనుంచి సుభాష్‌ను స్టీములాంచిమీదకు స్ట్రెచర్‌సాయంతో దింపారు. అతనికి చాలా నీరసంగావుంది. బెంగాల్ గవర్నరు యొక్క డాక్టర్ హింగ్‌స్టన్ ఆ సమయంలో ఆ లాంచీలోవుండి అతనికి సకలోపచారాలు చేశాడు. ఆరాత్రిఅంతా ఆ లాంచి నదిమధ్యలోనేవుంది.

... ... ...

దాసుస్థాపించిన ఫార్వర్డు ప కకు బోసుసంపాదకుడు. ప్రభుత్వా న్ని ఆపత్రిక ఎట్టి మొగమోటం కుండా విమర్శించేది. అందుచే ప్రభుత్వంవారి కన్నెఱ్ఱకు అది గు అయివుండేది. ఇది చాలనట్లు వు మీద పుట్రగా బెంగాల్ నాగపు ర్ కంపెనీవారు ఫార్వర్డుపత్రికమీ పరువునష్టపు దావా తెచ్చారు. హాయాభై వేలకు అది డిక్రీఅయి ది. తోడనే ఆ పత్రికనే నిలిపివే సుభాష్ వొక రాత్రికిరాత్రి నూ ఫార్వర్డు అనేపత్రికను లేవతీశాడ రెల్వేకంపెనీవారు ఈపత్రికకు కు డా పురిటిలోనే సందుకొట్టించార అంతమాత్రంచేత నిరుత్సాహపడ సుభాష్‌బోసు మూడోనాటికి ' బర్టీ' అనేపేరుతో మరో దినపత్రి లేవతీశాడు. సుభాస్ నిర్మాణ కౌ ల్యం, దీక్షాదక్షత అట్టివి.

... ... ...

1930 లో జనవరి 26-వ తేదీ స్వాతంత్ర్యదినం జరిగే నాటికి సుభా ష్ జయిలులోవున్నాడు. జయి లోవున్నా స్వాతంత్ర్యదినం జరి తీరాలని సుభాష్ తీర్మానించుకు న్నాడు. తోడి ఖైదీలకు ఉపదేశ చేశాడు. ఎల్లా సంపాదించారో ఖైదీలు జాతీయపతాకాలుకూడా సంపాదించారు. స్వాతంత్ర్యదినోత వం ఆ జెయిలులో అత్యంతజయప్ర

ంగా సాగింది. అయితే ఇంతకీ ఆజై లులలో సుభాస్‌కి జాతీయపతాం ఎట్లావచ్చింది? నాటికి, నేటికి విషయం రహస్యంగానేవుంది.

... ... ...

ఖైదులో వొకసారి సుభాస్ పట్ల, ఇతరఖైదీలపట్ల అధికారులు అమర్యాదగా వర్తించారు. దానికి సుభాస్ నాయకత్వాన్ని ఖైదీలు తమ అసమ్మతిని తెలిపారు. అందు మీద అధికారులు సుభాస్‌నూ, ఇతర ఖైదీలను మేడ మెట్లమీదినుంచి క్రిందికి దొర్లించారు. ఆదొర్లింపులో సుభాస్‌చెయ్యి బెణికి తిరిగిపోయింది మూడుగంటలకాలం అతడు అట్లాగే పడివున్నాడు. జ్వరంతగిలింది. ఆదెబ్బతో అతను చాలా రోజులుతీసుకున్నాడు.

... ... ...

20-10-౩౨ తేదీని విఠల్‌బాయి వియన్నాలో మరణించాడు. ఆసమయంలో సుభాషు విఠల్‌బాయి చెంతనేవున్నాడు. రోగగ్రస్తుల్ని ఉపచరించడానికి యువకుల్ని నర్సులుగా తయారుచేసివున్న శుభాష్ ఆసమయంలో విఠల్‌బాయిని విశేషంగా ఉపచరించాడు. విదేశాల్లో భారతదేశాన్నిగురించి ప్రచారం సాగించడానికి విఠల్‌బాయి తనవిల్లులో సుభాష్‌కు లక్షరూపాయిలు ప్రత్యేకించాడు.

... ... ...

దేశసేవలో అతడు ఆరోగ్యాన్ని కూడా లెక్కచెయ్యడు. మొన్న త్రిపురికాంగ్రెస్ అధ్యక్షతకు అతడు వైద్యుల సలహాలను తృణీకరించి ప్రయాణమయ్యాడు. ఇంటిదగ్గరనుంచి స్టేషన్‌వరకు యాంబులెన్సుకారుమీద, కారుమీదనుంచి కంపార్టుమెంటులోకి స్ట్రెచ్చర్‌మీద వెళ్లాడు. కాంగ్రెస్ క్షేత్రంలోనూ ఇదే పద్ధతి.

త్రిపురికాంగ్రెస్‌లో అతనిఆరోగ్యం మరీ చెడింది. 11-వ తేదీ సాయంకాలం అతనిజ్వరం 105 డిగ్రీలవరకు లేచింది. బొంబాయి ఆరోగ్యశాఖామాత్యుడు, జబ్బల్‌పూర్ సివిలుసర్జనూ అతణ్ణి పరీక్షించి అతఃస్థితి ఆందోళనకారణమైంది గావుందని వెల్లడించారు. అతణ్ణి జబ్బలుపూర్ ఆసుపత్రికి తీసుకువెళ్ళడంమంచిదనికూడా వారు సలహా ఇచ్చారు. కాని సుభాసు వినలేదు. అప్పుడు జవహరులాల్ నెహ్రూ వచ్చి-ఆవిషయం నొక్కి చెప్పాడు. అప్పుడుకూడా సుభాష్ వినిపించుకోలేదు. జబ్బల్‌పూరు ఆసుపత్రికి వెళ్ళడానికిగాను నేను ఇక్కడికి రాలేదు. కాంగ్రెస్ మహాసభ ముగిసేవరకు నేను ఇక్కడినుంచి కదిలేదిలేదు. చనిపోతే ఇక్కడే చనిపోతాను.' అన్నాడు. సుభాష్ పట్టుదల అట్టిది.

## అనంతకాలంనుంచీ ఛత్రం రాజ్యాధికారలాంఛనంగా గుర్తింపబడ్డది.

# ఛేంబర్లేన్ ఛత్రం

**ఇంగ్లండులో, అమెరికాలో గొడుగు మొదటి సారి దృగ్గోచరం అయినప్పుడు వీథుల్లో అల్లర్లరే గాయి. ఇపుడుఇంగ్లండులోఛేంబర్లేన్ ఛత్రం అల్లరి కాకపోయినా అపహాస్యాని కలిగిస్తూవుంది.**

ఆంధ్రభూమిపాఠకులకు గొడుగులువచ్చిన కొత్తలో ఇంగ్లండులోజరిగిన అల్లరులసంగతి తెలిసిన విషయమే. ఈనాడుకూడ ఇంగ్లండులో గొడుగులసంబంధమైన గొడవ ప్రబలంగావుంది. ఇంగ్లండు ప్రధానమంత్రి నెవిల్లీ ఛేంబర్లేన్ గొడుగు ఉపయోగపుగొడవని పెంచుతూవుంది.

ఛేంబర్లేన్ ఛత్రాన్నిగురించిన వార్తలు ఇపుడు ప్రపంచవార్తల్లో ప్రధానమైనవిగావున్నాయి. మొన్న జనవరిమాసంలో అతడు రోము మహానగరాన్ని సందర్శించినప్పుడు ఇటాలియన్ జనసముద్రం అతను తనకూడా గొడుగును తీసుకువచ్చినందుకు అపారంగా సంతోషించారు. 'ఛత్రం! ఛత్రం!' అనే పదాలతో అతనికి స్వాగతోపచారాలు, ఆహ్వానోపచారాలు సలిపారు.

ఈ రోజుల్లో ఛేంబర్లేన్ ఎక్కడికివెళ్లినా చేతిలో ఛత్రంవుండడం నిర్బంధమైపోయింది. అతడు అట్లా ఛత్రాన్ని మోసుకుపోవడం అది అవసరమై కాదు. ఛత్రం తీసుకువెళ్లడానికి అతను చిరకాలంగా అలవాటుపడిపోయాడు. ఆ అలవాటును మాన్చుకోవడం ఇప్పుడు అతనికి సుకరంగాలేదు. అదిన్నీగాక అతని ఛత్రాన్నిగురించి ఇపుడు అంతటా పాక్కివుంది. ఈపరిస్థితుల్లో గనక అతను ఛత్రాన్ని మానివేస్తే మరింత అభాసుగావుంటుంది,

అయితే ఛాంబర్లేన్ ఛత్రానికి ఇంతటి ప్రసిద్ధరావడానికి ఏమిటి కారణం? ఛేంబర్లేన్ ఛత్రంమూలంగా ఎన్నో ఛలోక్తులు పుట్టుకువచ్చాయి. ఛేంబర్లేన్ ఎక్కడికి వెళ్లినా ఛత్రం పట్టుకువెళ్ళవలసిన అవసరంలేదు. శాంతిమాతగా అతడు ఎక్కడికివెళ్లినా శాంతికలగవచ్చు, కలగకపోవచ్చు కాని అతను వానలో తడిసిపోతాడనే భయం మాత్రంలేదు. ఏమంటే అతను నియంతల్ని చూడ్డానికి పోతున్నాడు. నియంతలు స్వయంగావచ్చి అతన్ని చూస్తున్నారు. వాతావరణంలో
ర్షంకురిసేలక్షణాలు కనిపిస్తే అతడు వెళ్ళేమార్గంలో అంతా పైన ఏదో విధమైన ఆచ్ఛాదనం ఏర్పాటు చేయబడుతూనేవుంది. లేదా ఒక పెద్దగొడుగో, వల్లభమో ఏర్పాటు చేయబడుతూవుంది. ఆ వల్లభం క్రింద కాని, పెద్దగొడుగుక్రింద కా ఐదు ఆరుగురు మనుష్యులు ఎం వర్షంలోనేనాతడవకుండాపోవచ్చు

ఇంగ్లండులో పురుషులు గొడుగులు మోసుకుంటూపోవడం ప పాటికాదు. గొడుగులు మోసు పోయే పురుషులు సామాన్యంగ సీజన్ టిక్కట్ల హోల్డర్లు అయివుంటారు. ఆపురుషులు ప్రతిరోజు ఒ వేళకు ఒకే ప్రయాణాన్ని చేసు ప్రతిరోజు ఒకేవిధమైనపనిలో తగి వుంటారు బహుశా అట్టిపురుషు ఇళ్లల్లో ఆడపెత్తనంఅయితే క వచ్చు. మొగుడిమీాద మితిలే ప్రేమవుందనడానికగాను పెత్తనద రయిన పెళ్ళాం మగడు బయటి వెళ్ళేటప్పుడల్లా అతనికి గొడుగ అందిస్తూ వుండవచ్చు. పెళ్ళాని కాదనలేక ఆ పెనిమిటి అవసర వున్నా లేకపోయినా గొడుగుపట్టు వెళుతూవుంటాడు, అదే క్రమం అలవాటు అయిపోతుంది, ఛేం ర్లేన్ ఛత్రం ఉపయోగించే అలవా ఈపద్ధతిని ఏర్పడింది కాదు, అయి

ఛేంబర్లేన్ తన ఛత్రాన్ని వినియోగంగా ఉపయోగిస్తాడు.

ఛేంబర్లేన్ నేడు ఛత్రంతో అవినాభావంగా తలపబడుతూవున్నాడు. చరిత్రలో మరియొక రాజకీయధురంధరుని నామంకూడా ఛత్రంతో అవినాభావంగా జతపడివున్నది. ఆ రాజకీయధురంధరుడు ఎవరంటారా? అమెరికన్ అధ్యక్షుడుగా అతిలోకఖ్యాతిగాంచిన అబ్రహాంలింకన్. ఆ అబ్రహాంలింకన్ ఛత్రం ఇప్పటికికూడా ఒక చారిత్రకసంఘంవారి మ్యూజియమ్‌లో భద్రపరుపబడివుంది. లక్షలకొలది అమెరికన్‌లకు ఇప్పటికికూడ ఛత్రచిహ్నం లింకన్‌నామంతో అవినాభావంగా జతపడివున్నట్లు స్ఫురిస్తుంది.

ఛేంబర్లేన్ చత్రపుగొడవతో ఛత్రం మళ్లీ తనపూర్వపురాజకీయ గౌరవాన్ని. తనప్రాక్తన వైభవాన్ని పొందుతూవున్నట్లు కనిపిస్తూవుంది.

ఛత్రంయొక్క చరిత్రలో అనాదికాలంలో చత్రం రాజ్యాధికారానికి ఒకచిహ్నంగా, రాజగౌరవానికి ఒక లాంఛనంగావుండేది. ప్రాచీనమైన అస్సీరియాదేశంలో ఛత్రం రాజచిహ్నంగావుండేది. ఇట్లా అనడంచేత ఆనాటి అస్సీరియారాజు నేటి ఛేంబర్లేన్‌వలె ఛత్రాన్ని చేత పట్టుకునివుండేవాడనికాదు. అస్సీరియారాజు గొడుగుని ఒకసేవకుడు మోస్తూవుండేవాడు. ఆ గొడుగు వీధిలో కనిపించడంతోటే అస్సీరియా ప్రజలకు రాజువస్తున్నాడనీ, తాము గొంతుకలు సవరించుకొని అస్సీరియన్ జాతీయగీతాన్ని పాడడానికి ప్రారంభించాలనీ అవగతమయ్యేది.

ఈజిప్టుదేశపుప్రభువులూ, ఇతోపియా (అబిసీనియా) దేశపు ప్రభువులూ ఛత్రాన్ని రాజలాంఛనంగా వాడేవారు. వారుయెక్కే బండి నడుమను ఒకపొడుగుకొయ్య ఉండేది. ఆ కొయ్య అగ్రాన్ని ఒక చత్రం. ప్రాచీనకాలపు ఈజిప్షియన్ పెయింటింగులో సామాన్యమానవులు ఎవ్వరూ చత్రచ్ఛాయలో వున్నట్లు చూపబడివుండలేదు.

పెర్సిపోలిస్‌లోని చిత్రాలలో రాజుకు చత్రంవున్నట్లూ, ఆచత్రాన్ని ఒక సేవకురాలు పట్టివున్నట్లు చూపుతూవున్నాయి. శతాబ్దులుగా చత్రం ఇదేస్వరూపంతో వుంటూవుంది. పూర్వకాలపుచత్రాలికి కొసల్ని కుచ్చెళ్లువుండేవి; నడుమను ఒక పువ్వువుండేది. తరువాతి కాలంలో చత్రాలికి ఒకప్రక్కను పట్టుబట్టకాని, లేదా విలువగల మరియొకబట్టకాని వ్రేలాడుతూ వుండేది.

ఆవా, పెగూదేశపురాజులకుగల బిరుదావళిలో 'ఇరువదినాలుగు చత్రాల అధిపతి' అనేది ఒకటి. ఈ బిరుదు వట్టిమాట, అర్థరహితమైన పలుకుకాదు. ఆ రాజుగొడుగుకు ఇరవైనాలుగు బెత్తాలు వుండేవి. ఆరాజు రాజ్యంలో ఇరవైనాలుగురాష్ట్రాలు. ఒక్కొక్కగొడుగుబెత్తం ఒక్కొక్క రాష్ట్రానికి గుర్తు.

ఈప్రాంతాల్లో చత్రంరాజ్యాధికార చిహ్నమనే అభిప్రాయం అనాది సిద్ధంగా పాదుకొనివుంది. 1855 లో బర్మాదేశపురాజు తనను గూర్చి చెప్పుకోవడంలో 'తూర్పు దేశాల్ని పరిపాలించే చత్రపతుల్ని పరిపాలించే మహారాజు' అని చెప్పుకొనివున్నాడు. కాగా ఛేంబర్లే చత్రం అధికారచిహ్నమని పాశ్చాత్యులలంటే తూర్పుదేశస్థులకు విం

తగా ఎంతమాత్రం తోచదు.

చత్రాల్నిగురించి మొదటిగా ప్రస్తావించిన ఆంగ్లగ్రంథకర్తల్లో తోలిజట్టుకుచెందినవాడు ఒకడు వానినిగురించి అనుమానంతోకూడిన అభిప్రాయాల్ని వెల్లడించారు.

పదిహేడోశతాబ్ధిలో ఇటలీ చుట్టివచ్చిన బ్రిటిష్‌యాత్రికుడు ఒకడు ఇట్లావ్రాసివున్నాడు: 'ఉష్ణదేశాల్లో ప్రజలు సూర్యాతపంనుండి తప్పించుకోవడానికి గొడుగులు ఉపయోగిస్తారు. ఆగొడుగులు వల్లభాల్లావుంటాయి. వాటిని వారు తలల మీద ధరిస్తారు. వైద్యవిద్యావేత్త ఒకడు వానిఉపయోగం ఆరోగ్యప్రదమైంది కాదని చెపుతాడు. ఏమంటే ఆ గొడుగులు సూర్యాతపాన్ని నిరోధించడంలో తమ అగ్రానికి సూర్యాతపాన్ని ఆకర్షించి ఆవేడినంతా నేరుగా గొడుగు వేసుకునేవాని తలకు ఎక్కిస్తాయి.'

ఆంగ్లదేశంలో పదిహేడో శతాబ్దంలో గొడుగుల్నిగురించి వున్న అభిప్రాయంయొక్క తీరు అది! ఆంగ్లదేశానికి ఆదిలో దిగుమతిఅయి ఫాషన్‌గా అంగీకరింపబడ్డ గొడుగులు చాలా ఖరీదుగలవై పక్షిరెక్కలతో చేయబడినవిగా వుండేవి. అయితే ఒకసంగతి. ఇంగ్లండులో గొడుగుల ప్రయోజనం సూర్యాతపరక్షణంకాదు- వాననుండి మనుష్యుల్ని కాపాడడం అచ్చటి గొడుగుల ప్రయోజనం. ఆ దృష్టిలోనే బెన్‌జాన్‌సన్ అనే ఆంగ్లనాటకకర్త - షేక్సుపియర్ సమకాలికుడు- గొడుగుల్నిగురించి తన నాటకాల్లో ప్రస్తావించాడు. మరో శతాబ్దానికి పిమ్మట స్విఫ్టు అనే ఆంగ్లగ్రంథకర్త వానతుఫానున్నుండి వనితల్ని రక్షించే పని ముట్టుగా గొడుగుని పేర్కొవడం గొడుగుని కించపరచడమే అని వ్రాసివున్నాడు.

1752 లో లెఫ్టినెంట్‌కల్నల్ వుల్ఫు గొడుగులు ఆంగ్లదేశంలో ప్రవేశపెట్టతగినవే అని ప్యారిస్ నుంచి వ్రాశాడు. ఊలాగానే లండన్ వీధుల్లో ఒకపురుషుడు గొడుగువేసికొని వెళుతూ కనిపించాడు. ఆంగ్లప్రజలు అంమతో పెద్దగగ్గోలురేపారు. పెద్ద అల్లరిజరిగింది. ఆ గొడుగు వేసుకున్నవానిని ఆంగ్లప్రజలంతా కులుకునడకలు నడిచే పోకిల్లా ఫ్రెంచిపౌరుడు అని దుయ్యపట్టుకున్నారు.

దాంతో ఇంగ్లండులో గొడుగులు వెంటనే ఎక్కిరావడం కష్టమైంది. ఈ గొడవనడిచిన ఇరవై ఏళ్ళకు దరిమిలాను మరిఒకసాహసవీరుడు గొడుగువేసుకుని లండన్ వీధుల్లో నడవడానికి ధైర్యంచేశాడు. ఈసారి అల్లరి ఏమీరేగలేదు. కాని కొందరుప్రజలు నెమ్మదిగా అతని దగ్గరకువెళ్ళి ఆగొడుగువేసుకుని నడిచిపోవద్దనీ, ఏదేనా కోచ్ బండిల్లో ఎక్కిపోవలసిందనీ ఉపదేశంచేశారు.

అయితే ఆదిలో ఇంగ్లండులో గొడుగులంటే ఇంతద్వేషంఎందుకు ఏర్పడింది? ఇంగ్లండులో కోచ్ బండివాళ్ళు అంతాఏకమై కోచ్‌లు ఎక్కకుండా వెళ్ళేవాళ్ళంత వానవంగుడిలోతడిసే శిక్షకుపాత్రులుకావాలని భావించారు. ఆంగ్లదేశంలో గొడుగులు బాగా వాడకలోకివస్తే వాన సమయంలోకూడా ప్రజలు ఆ గొడుగుల్నిధరించి నడిచిపోతారనీ తమబళ్లు ఎక్కరనీ వారికిభయంపుట్టింది. కాగా వా సాధ్యమైనంతవరకు గొడుగులక ప్రతికూలప్రచారాన్ని సాగించారు.

బ్రిటిష్‌దీవుల్లో వాడుకలోనివచ్చిన మొదటిగొడుగులు పట్టసంబంధమైన నూనెగుడ్డల్తో చేయబడ్డాయి. ఆనాటి ఆ గొడుగులు తెరవడంకాని, మడత పెట్టడకాని చాలాకష్టంగావుండేది. 185 వ సంవత్సరంవరకు మనం నేడు ఉపయోగించే కొత్తరకపుగొడుగులు కనగొనబడలేదు.

అమెరికాలోకూడ మొదటిగొడుగు అల్లర్నిరేపింది. 1772- సంవత్సరంలో బాల్టిమోరిలోనిఒక గొప్ప వర్తకుడు ఇండియానుంచి వచ్చిన ఒక ఓడలో ఒకగొడుగుని కొన్నాడు. ఆ ఓడనుంచి ఇంటి

వస్తూవుండగా దారిలో వానవచ్చింది. ఆవాననుండి తన్ను రక్షించుకోవడానికి ఆ గొడుగుఉపయోగిద్దామనేబుద్ధి అతనికికలిగింది. వెంటనే అతడు గొడుగును తెరిచేసుకున్నాడు.

ముడతలలోవున్న గొడుగు తెరవబడ్డం దగ్గరలోవున్న స్త్రీలు, గుఱ్ఱాలు, చిన్నపిల్లలు చూశారు.ఆవింత రూపానికి స్త్రీలు హడిలిపోయి బేజారెత్తారు. చిన్నపిల్లలు ఝడుసుకుని బిగ్గరగా ఏడవడానికి ప్రారంభించారు. గుఱ్ఱాలు సకిలించి బళ్ళను వెనక్కి-ముందుకి లాగుతూ కాళ్లుఎత్తి బండిని తన్నడానికి ప్రారంభించాయి. పురుషులు వీరులు కాబట్టి స్త్రీలల్లా హడిలిపోక-పిల్లల్లా ఝడుసుకోక-గుఱ్ఱాల్లా బెదరిపోక గుంపు గుంపుగావచ్చి ఆ వర్తకుడి మీదపడి వాడిగొడుగులు తుంబ తుంబాలుగా చింపివేశారు.

ఈ రోజుల్లో రకరకాల గొడుగులు వుంటున్నాయి. వానిలో కొన్నిటిచేత చాలాకాలం మన్నేదిగా వుంటూవుంది. అందుచేత ఒకమనిషి ఒకేగొడుగుని చాలా కాలం వాడుకోడానికి అవకాశం వుంటూవుంది. కొద్దికాలానికిపూర్వం అమెరికాలో ఒకచర్చ రేగింది. ఇప్పుడు అక్కడవున్న గొడుగుల్లో ఏది చాలాకాలంనుంచి వాడబడుతోంది అని. ఆచర్చలఫలితంగా ఒకవ్యక్తి ప్రఖ్యాతుడు అయ్యాడు. అతడు న్యూజెర్సీకి చెందిన అకర్ మాన్. అతడు నలభైతొమ్మిది సంవత్సరాలుగా వొకేవొక గొడుగును ప్రతి రోజున విడవకుండా ఉపయోగిస్తున్నాడట. ఆకారణంచేత ఒకేగొడుగును బహుకాలం ఉపయోగించిన ఖ్యాతి తనకురావాలని అతడు అంటాడు. కాని ఈవిషంలో ఇంకా చర్చ, పరీక్ష, పరిశోధన సాగించబడింది. న్యూయార్కులో ఫ్రెడ్. యస్. గుడ్ విన్ అనే ఆసామీ వున్నాడు. అతడు యాభైమూడు ఏళ్లుగా వొకే వొక్క గొడుగును ఉపయోగిస్తూవున్నాడట.అందుచేత ఈవిషయంలో నూజెర్సీలోని అకర్ మాన్ కంటె న్యూయార్కులోని గుడ్ విన్నే మరికొన్ని ఆకులు ఎక్కువ చదువుకున్నవాడనే విషయం నిర్ధారితమైంది.

. ఛేంబర్లేన్ చత్రం ఇపుడు చరిత్రప్రసిద్ధమూ, ప్రపంచప్రఖ్యాతమూ ఐంది. అయినా అతగాడు తానా చత్రాన్ని ఎంతకాలంక్రితం కొన్నది కాని, ఎంతకాలంగా అది తనవద్ద పనిచేస్తూవున్నది కాని ఇంతవరకు బయలుపెట్టలేదు.

ఇటీవల లండన్ లో బ్రిటిష్ ఇండస్ట్రీస్ను అన్నిటినీ వొకచోట చేర్చి అమ్మేసంత వొకటి జరిగింది. ఆసంతలో స్కాటిష్ నేషనల్ డెవలప్ మెంటు స్టాండువారు ఛేంబర్లేన్ చత్రాన్ని 'పరిశ్రమల్లో శాంతికి ఇది వొక చిహ్నం' అనే శీర్షికతో ప్రదర్శించారు. ఛేంబర్లేనసతి ఆసంత చూడ్డానికి వెళ్ళినప్పుడు తనభర్త గొడుగునూ, దానికి ఉటంకించబడ్డ శీర్షికనూచూచి ఎంతో ఆనందించి మెచ్చుకొంది.

## 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువ యైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మాత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ? కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

### శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అమితముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుషలేహ్యసేవనమువలన

| | | |
|---|---|---|
| కండపుష్టి | : | కాయపుష్టి |
| బలము | : | ఆరోగ్యము |
| శరీరబింకం | : | జీవితసౌఖ్యం |

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలుచేర్చి తయారుచేయబడిన తియ్యని రసాయనము. శుక్లనష్టమును సూటిగ కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

రత్నపురుష డిపో,
2/40 పెద్దినాయునివీధి,
మదరాసు.

డబ్బున్నవాళ్లు చేసేతప్పులు ఎప్పుడూ తప్పులుగా పరిగణింపబడవు.

# చిన్నమ్మ కటాక్షప్రభావం

ఉ. పండితుఁ డాతఁ డాతఁడు ప్రభావసమగ్రుఁ డతండు శూరుఁ డా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁ డతండు మహాకులీనుఁ డా
తండు కళావిదుం డతఁడు ధనుఁ డతండు మనోజ్ఞమూర్తి యె
వ్వండు భవత్కృపాకలన వైభవలక్ష్మికిఁ బాత్ర మిందిరా!

ఉ. ఎవ్వని నేని నీవు దయనించుకఁ జూచిన వానిఁ జూతు ర
ప్పువ్విలుకానిఁగా సతులు; భూపతిఁగాఁ బ్రజ; కల్పకంబుఁగా
నవ్విబుధాశ్రితప్రతతి; యంబుధిఁగాఁ గులగోత్రగోత్రముల్
కవ్వడిఁగాఁ బరద్విషులు; గన్నినిఁగాఁ గవులెల్ల శ్రీసతీ!

—శ్రీకాశీఖండము.

'ధన మూలం యిదం జగత్తు' అనీ, 'ధనహీనునకు' చెడుకార్యసిద్ధి. అనీ రెండు ఆర్యోక్తులువున్నాయి. ఆ ఆర్యోక్తులు ధనంయొక్క ప్రాధాన్యతను నిరూపిస్తున్నాయి.

కాని అట్టి ప్రధానమైన ధనాన్ని పొందలేని దరిద్రులు కొందరు ధనసంపాదన కూడదనీ, సంపాదించినా దానంచేసివేయాలనీ ప్రాసారు పుస్తకాల్లో—నక్క రేలకాకులతంతుగా.

ధనం యొక్క అధిదేవత లక్ష్మీదేవి. ఆమెకు హిందూదేశంలో ఎన్నిరకాల పూజలు పునస్కారాలు, జపాలు తపాలు నోములు వ్రతాలు జరుగుతాయో అంతూ పొంతూలేదు. దీపావళికి మనదేశంలో ఆమెకుజరిగే శోభాయమానమైన పూజ అద్వితీయం. అంతే కాక ప్రతి విష్ణుదేవాలయంలోనూ ఆమెకు ప్రత్యేకభవనం వుంది.

ధనానికి అధిష్ఠానదేవత అయిన ఆమెకు అన్నివిధాల పూజలు జరగడం సహజంగానే వుంటుంది. పైగా ఆమెసంపర్కం ఉన్నవారి అందరికీకూడా లోకంలో అపరిమితమైన, వైభవోపేతమైన స్వాగతోపచారాలు జరుగుతాయి. ధనమే ప్రపంచలీల కదా!

ధనమనే యిరుసుమీదే యీ పృథ్వీచక్రం తిరుగుతోంది. ఆధనం అనేకరూపాలతో వుండవచ్చు. అది పాడిరూపంకావచ్చు. పంటరూపంకావచ్చు. లేదా నోట్లకట్ట రూపాన్ని వుండవచ్చు. ఈరోజులలో ఆనోటులకట్టకున్న విలువ తక్కిన వాటికి లేదు.

ధనములేనివాడు దమ్మిడీకి మారడు. అతడు ఎంత త్యాగంచేసినా, ఎంతసేవచేసినా ప్రజలు తెలుసుకోనరు. డబ్బుఉన్నవాడు కొంచెం తెగిస్తే చాలు అతనిని ఊర్ధ్వలోకానికి ఎత్తేస్తారు.

విష్ణుమూర్తిని సృష్టికి స్థితికారకు డన్నారు ఎంచేత?

దేవతలు రాక్షసులు సముద్రం తరిచారు. దాంట్లోంచి బయటపడింది లక్ష్మీదేవి. అంతవరకూ పాలసముద్రంమీద నిద్రపోయే పెద్దన్నయ్య– ఆవిష్ణువు చక్కావచ్చి దానిని చంకనేసుకు పోయాడు. దాంతో అతనికి పట్టు పీతాంబరాలు కట్టబెట్టి మణులతో చేసిన హారాలు మెడనువేసి వైకుంఠానికి అధిపతిని చేసారు. అతని అడుగులకు మడుగులు వగ్గారు దేవతలు. అందుకే దొంగవేషంవేసి—మోహినివేషం-అమృతంకాస్తా వాళ్ళకే పోసాడు.

డబ్బుచేరడంతోటే ఆబొడుతామర ఆసామీ లక్ష్మీదేవిని రక్షించుకోడానికి చక్రం-ఎవరైనా మీదపడితేగోలచేయడానికి పాంచజన్యం ఎప్పుడూపట్టుకుని సిద్ధంగా వుండటానికి మరోరెండు చేతులు చేయించుకున్నాడు. పెద్దమనుషులవద్దకు డబ్బుచేరితే వారుపడేపాట్లు ఇల్లాంటివిగా వుంటాయి. ఇన్ని బందోబస్తులుచేసినా తనభర్త విష్ణుమూర్తి యితరులచేత తాపులు తిన్నాడని కోపించి లక్ష్మీదేవి లేచిపో

యింది. అలక్ష్మి కాస్తా జారిపోతే యింకేముంది? వైకుంఠంవల్లకాడు అయినది. మన విష్ణువు తుప్పలు. గుట్టలు పట్టాడు, 'లక్ష్మీ! లక్ష్మీ' అంటూ.

తుదకు తిరుపతిలో తేలాడు వెంకటేశ్వరుడై. ఆప్రాంతంలోని ఆకాశరాజు కూతుర్ని పెళ్ళిచేసుకున్నాడు కుబేరునివద్ద పెద్ద అప్పు చేసి.

పెళ్ళికిచేసిన ఆ ఋణంతీరే ఉపాయంలేక అదేదీక్షలో పడి స్తబ్ధుడై క్రమంగా స్థాణువయిపోయినాడు.

తనభర్త తన్ను అన్వేషిస్తూ, ఉపాసిస్తూ యిట్లా చింతలోపడి చితికిపోయాడనీ, రాయి అయిపోయాడనీ తెలుసుకుని కటాక్షించింది ఆ లక్ష్మీదేవమ్మ. దాంతో ఆరాయికి కూడా మహాభోగంపట్టింది. ఆరాయి హఠాత్తుగా వడ్డికాసుల దైవంఅయింది.

ఆతిరుపతిస్వామి కస్తూరిబొట్టు కోసం వందరూపాయిలు కర్చుపెడతారు ప్రతి శుక్రవారమూను.

దినానికి ఎన్ని గంగాళాల చక్రపొంగలి కాచేస్తాడో లెక్కలేదు. ధనికులకే తగింది తినడం.

సృష్టిపోషకుడని పేరుకాంచిన మహావిష్ణువుకూడా తుప్పలంట పడ్డాడు లక్ష్మి తొలగిపోతేను.

శ్రీరంగనాయకునికి జరిగే భోగం అంతూ పంతూ వుండదు.

ఈశ్వరుడు ఐశ్వర్యప్రదాత అన్నా అతడు ఆదిభిక్షువు అవడం చేత ముఖాన్ని యింత వీభూతి పూస్తారు. కట్టుకునేది చర్మం, ఎక్కేది ఎద్దు, వుండేది కొండ. ఎక్కడ కస్తూరి! ఎక్కడి వీభూతి!

ఆముఖాన్ని ఆవీభూతేనా అతగాడికి-లక్ష్మీదేవి తోబుట్టువు చంద్రుడు అతని నెత్తి ఎక్కాడు కాబట్టి అనుకుంటూ, లేకపోతే ఆముష్టి వానిని చూచే దెవరు?

ధనముంటే ఎన్నిశాపాలైనా భూషణాలుగా మారతాయి. ఇంద్రుడికి వజ్రాయుధం మొదలైన ఆయుధాలు; రంభా మొదలైనముండలు; ఉచ్చైశ్రవం, ఐరావతం మొదలైన జంతుజాలం వున్నాయి. దేవతలకు రాజతడు. ఆధనమదం చేతనే గౌతమునికి పంగనామం పెట్టాడు. ఆముండావాడు మండిపడి శపించాడు 'సహస్రయోనిగాడవు' కమ్మని. కాని అతనికి ఆయోనులన్నీ కళ్లు అయినాయి. దేవతలలో అతనికి ఏమీ లోపంరాలేదు. దీనికి కారణం ఇంద్రుడికి డబ్బు విస్తారంగా వుండడమే.

చూడండి మన్మధుడు ఆడవాళ్ళను మొగాళ్ళను తెగ ఏడిపిస్తాడు. ఈలా ఏడిపించేవాణ్ణికూడా తెగస్తుతించారు మనవారు. అతని కన్నతల్లి లక్ష్మీదేవిని చూచికాదూ! చెఱకువిల్లుకాడట. పుష్పబాణుడట. అంత రూపవంతుడు మరిలేడట. ఈభట్రాజు స్తుతులన్నీ వాళ్ల అమ్మనుచూచికదూ! లక్ష్మీపుత్రుడు లక్షణంగావుండక ఎలా వుంటాడు? వుండకపోతే మాత్రం వికారంగావున్నాడని ఏదౌర్భాగ్యుడంటాడు.

విఘ్నేశ్వరుడు వీభూతిరాం
కొడుకు. కనుకనే వాని ఏన
బుర్ర, మూషికవాహానం బా
ప్రచారంలోకి వచ్చి వ్రతకలా
లోకి ఎక్కాయి. వాడిని తి
వాడు లేడు.

బురదలోపుట్టిన తామరపు
అంత ఘనతఎక్కడిది? లక్ష్మీదే
అది నిలయంకాబట్టేకదా! కో
లో ఆపువ్వులు ఉన్ననాడే దా
శోభ. ఇట్లా ఆలక్ష్మీకటాక్షం ఎ
వరకూ పాకితే అంతవరకూ ఘ
వస్తుంది. అందుకే మన ప్రబ
కారులు కమలమును తామ
తెగ పొగిడేసారు.

మృగాల్లో స్థూలమైంది,
మైంది ఏనుగు. కాని దానికి
జ్యంపూజ్యం. ఏకుపాయిలావు
సింహానికి ఎక్కడలేని గౌర
అది గర్జిస్తే అందరికీ హడలే.
నినోరుచూస్తే రారు ఎత్తుతా
మృగాలు. అది మృగరాజు ఎం
చేతో తెలుసా? లక్ష్మీదేవికి
హానంకావడం చేతనే.

రావణుడు రంభను బలవ
పెట్టాడు. ఆరండ నలకూబరుని
చెప్పుకుని పెద్దరగడ పెంచి
దాంతో ఆకుబేరతనయుడు కు
డై శపించాడు. పదితలకాయల
కంఠుడుకూడా ఆధాటికి ఆగ
పోయాడు. ఎంచేతనంటే కుబేర
యుడి ధనంయొక్క తధాకా
డబ్బుకలవారి ముండలకేసి సా
న్యుడు కన్నెత్తి చూశాడా కా

ళ్లో పడ్డాడన్నమాటే.

పురాణగాథలలో ధనానికి యిం
ప్రాధాన్యం యిచ్చారంటే ధనం
యుక్క విలువ మానవజీవితమును
ంతగా మారుస్తుందో కించత్తు
సూచించండి. ధనమున్నవానినే
రాజు అన్నారు. అతడు ఆధనా
యితరులను కొట్టి, దారులు
ట్టి సంపాదించినా సరే.

ధనాధిదేవతకు పూజచేయడమే
కుండా దానిని భద్రంచేసే కుబే
నికి నిత్యము నమస్కరించమని
తడు ఉత్తరదిశగా వున్నాడని ఆ
్యలు సంధ్యావందనంలో కూడా
ురికించారు. అది కొంతవరకూ
జమే. కుబేరు లనతగ్గవారు హిం
ూదేశంలో ఉత్తరాదినే వున్నా
. దక్షిణాపథానికి చెందిన ఆంధ్ర
శేశములో ఒక కోటీశ్వరుడైనా
ున్నాడా !

ఆధునిక కాలంలో కూడా ఈ
న ప్రాబల్యం విరివిగానేవుంది. అం
ులోనూ మనదేశంలో చదువు
ంధ్యలు తక్కువగుటవల్ల దాని
ధికారం మరీ హెచ్చుగావుంది.

అమెరికాదేశంలో కోటీశ్వరు
ు వందలాదిగా వున్నారు. అందు
కే ఆదేశం, జాతి, ప్రపంచంలో
గ్రస్థానంలో వున్నాయి. ఏజాతి
లో ఎక్కువమంది ధనికులుంటే ఆ
ాతి చప్పున అభివృద్ధి పొందుతుం
ి. అందుకే మనిషికి వున్నదీ, పశు
ుకి తిన్నదీ బలం అన్నారు. ఆదేశం
పపంచదృష్టికి కేంద్రస్థాన మా
ుంది. అమెరికాకేసి యితరదే
శాలు బేలచూపులు చూచుట దా
ని ధనధాన్యసమృద్ధివల్లనే. మన అహింసా తత్వ స్వరూపి మహాత్ముడు కూడా ధనమహిమ గుర్తించి బోలెడు ధనం గడించాడు. గడిస్తూవున్నాడు. ఆధనమును యిన్వెస్టు చేసి కాంగ్రెసుసంస్థ వృద్ధిచేసాడు. కనుకనే మహాత్ముడైనాడు. ఏదోవిధంగా ధనం సంపాదించడం కాంగ్రెసుపేరుచెప్పి. ఒక్క సంతకానికే (ఆటోగ్రాఫ్‌కి) పుచ్చుకుంటాడు అయిదురూపాయలు, గాంధీమహాత్మునికే తెలుసు డబ్బుయొక్క విలువ. జవహరలాల్ తండ్రి మోతీలాల్ కోట్లకొద్దీ గణించాడు. గణించినదానిలో శక్తికొద్దీ దానంచేసాడు కాంగ్రెసుకి. తండ్రి తరువాత జవహరు తనకుతోచినంత యిచ్చాడు. అయినా యింకా అతనికి ధనం మూలుగుతూనే వుంది లెక్కలేనంత. సాలీనా సుమారు 25 వేల రూపాయలు ఇన్‌కంటాక్సే కడతాడుట! అయితే ఆధనంయొక్క పరిమితి వూహించుకోవచ్చు.

అందుకే కాంగ్రెసులో అందరూ ఒకఎత్తు యితను ఒక్కడూ ఒకఎత్తు. ఆతని డబ్బునుపట్టి అతడు సోషలిస్టు అంటే నమ్మడం ఎట్లా? మనదేశంలో నేటి సోషలిస్టులందరూ చాలావరకు యీలాంటివారే.

ఆంధ్రులలోనే ధనికులు పూజ్యం. అందులోనూ మననాయకుల వద్ద ధనం మరీపూజ్యం. కాబట్టే ఆంధ్రనాయకుడు సాంబన్న యింగ్లండు వెళ్ళలేకపోయాడు. డబ్బుకల జవహరు సూటుహేటుతో ఎన్నిసారులు వెళ్లాడో? మళ్ళీ వీరు యిద్దరూ ఆ కాంగ్రెసు సభ్యులే.

డబ్బు బాగా సముపార్జించి—తిరిచెంగోడు ఆశ్రమం పేరిట పెట్టాడు కనుకనే రాజాజీ ప్రధాన మంత్రి అయినాడంటాడు మా పుకారుపురుషుడు. అది నిజమైనా కాకపోయినా ధనికులతో వియ్యమందాడు కనుకనే అతడు ఆపదవి పొందాడు.

పేరుపెట్టటానికి పెళ్లాంకూడా లేదు కాబట్టే ఆంధ్రకేసరి రంకెలు ఎవరిచెవిని ఎక్కనవికావు. గోపాలుడు, రాజన్, సుబ్బరాయన్ ప్రభృతులు లక్ష్మీపుత్రులు అవడం చేత సులభంగా మంత్రిపదవి సంపాదించారు.

మంత్రిపదవులదాకా ఎందుకు? డబ్బుయొక్క విలువచూడాలంటే ప్రతిదినం రోడ్డుమీదే చూడవచ్చు. పోలీసువాడు కారుకి రైటుయిచ్చినంత చప్పున సైకిలికికాని, వండ్లబండికికాని దారియియ్యడు. కారులోవున్న ధనికునికళ్లు ఎరుపెక్కితే అతడి కూటిలో దుమ్మపడుతుందని భయం. ధనమంటే ఆరక్షక భటునికి కూడా అంతభయం.

కాబట్టి ఎటుచూచినా వొక దేశంకాని, జాతికాని సంస్థకాని, మనిషికాని ఉన్నతపదం చూడాలంటే పుష్కలంగా ధనముండాలి.

మద్రాసుబడ్జట్టులో సాలుకు కోటిన్నర రూపాయిలు అరవలకు ధారపోసే ఆంధ్రులు ఈవిషయాన్ని ముఖ్యంగా గమనించాలి.

# తేనె పిచ్చివారిని మంచివారిగా, మంచివారిని పిచ్చివారిగా చేస్తుందా

# తేనెటీగల సృష్టిరహస్యం

**విషవృక్షాలపూలనుండి గ్రహింపబడ్డ తేనె విషమే అగునా ?**

**తేనెటీగలు పువ్వులనుండి తేనె గ్రహించడమేనా మరేపని నేనా చేస్తున్నవా ?**

**ఏవృక్షాలపువ్వులు హెచ్చుగా తేనెటీగలకు ఉపకరిస్తవి ?**

పరమాత్ముని దృష్టిలో గడ్డి పోచకూడా ఘనమైనదే. అనామకమైనవి అనుకునే వృక్షముల యొక్క, మొక్కలయొక్క వృద్ధికై ఆపరంధాముడు అద్భుతమైన విధానములను ఏర్పాటుచేశాడు. ప్రకృతిలో తేనెటీగ ఝుంకారంచేస్తూ పండిన పుప్పొడిరేణువులను తన కాళ్ళతోను, రెక్కలతోను మోసుకుపోయి కేసరములకు అందచేస్తుంది.

వంశము వృద్ధిచేయడానికి ఏర్పడిన పువ్వులు పుప్పొడినియిచ్చే తేనెటీగలను ఆకర్షించుటకుగాను అందమైన రంగులు, సువాసన కలిగివుండడమే కాక వాటిశ్రమకు ప్రత్యమ్నాయముగా తీయని మధురరసముకూడా ప్రసాదిస్తాయి.

ఆ మధురరసమునకు ఆశపడే తేనెటీగలు ప్రతి పుష్పమును చూస్తూవుంటాయి. ఆమధురరసమునకై ప్రాకులాడే సమయమందే పుప్పొడి ఆపూవులో తగుల్కొని కాయఅగుచున్నది. ఈవిధముగా తేనెటీగలు యితర కీటకములు గాలిమొదలైన వాటివల్లను పుప్పొడి ఒకపువ్వునుండి యింకోపుష్పమునకు- కింజల్కములనుండి కేసరము ప్రాకుచుండును. అది భగవంతుని లీల—భోగంసాని మెరుగుల వంటి మెరుగులుపెట్టుటే కాక కొన్నిపువ్వులకు ఆకారంకూడా గర్భధారణకు అనుకూలంగావుండేటట్టు నిర్మించాడు బ్రహ్మ—తేనెటీగలు దానంచేసినంత పుప్పొడిదానంచేసి, మిగిలిన పుప్పొడిని దానికి ప్రతిఫలంగా పొందిన మధురద్రవమును స్వీకరించి జీర్ణంచేసుకొని తేనెగామార్చి తమపట్టునందు భద్రపరచును. అట్లు సేకరించిన తేనె, పుప్పొడులే ఆ తేంట్లకు ఆహారవస్తువు. సాధారణముగా ఒక తేనెటీగ ఒకప్రయాణములో ఒకేరకపు పుష్పములను దర్శించును. లేనిచో కంత్రీజాతి కాయలు కాస్తాయి కాబోలు. దానికికూడా అంత తెలివి కల్పించిన బ్రహ్మ ఎంతవాడో?

పువ్వునుండి సంపాదించిన మ[...] రరసమును మనము సేకరించకలి[...] నను అది తేనెకానేరదు. ఆమ[...] రసమును తేనెటీగలు పీల్చుకొ[...] తమజీర్ణకోసముచ దానిని తేనె[...] మారుస్తున్నవి. అట్లు మార్చి రె[...] గావేసే తేనెటీగల మలమే మన[...] అతి ఆప్యాయంగా తినే తేనె.

ప్రకృతిలో తేనెటీగలకు య[...] ద్రవమును, పుప్పొడిని ఇచ్చే వృ[...] ము లనేకములున్నవి. మంచి పుప[...] డిని యిచ్చేవి అముదము, బం[...] ళాబంతి, పెల్టోఫోరమ్, సరఘువ్[...] జొన్న మొదలైనవాటి పూలు.

ఎక్కువ మధురరసమును ఇ[...] చ్చేవాటిలో నారింజజాతి వృక్షవ[...] లు, అరటి, పత్తి, చింత, యాం[...] గ్నమ్ స్ట్రిబిలాన్ థస్ ముఖ్య[...] నవి. ఇందులో కడాపటిది అయి[...] యాంటిగ్నమ్ స్ట్రిబిలాన్ తస్ [...] విగా దక్షిణహిందూదేశమున కొ[...] డలపైన, సింహళద్వీపమున పె[...] గును.

తేనెటీగలు వాటిరెట్టను [...] తిరిగి ఆహారముగా తింటాయి. [...] డ్లకు పుప్పొడి, తేనె, నీరు కలిపి [...] తాయి తేనెటీగలు. ఆపదార్థా[...] 'బిబ్రెడ్' అంటారు. కావున తే[...] టీగలు శాఖాహారులు. అందుచే[...] నే అవి సాధారణముగా ఋషు[...] వనాల్లోనే విరివిగా వుంటాయి.

కాబట్టి తేనెటీగలను పెంచువారు వారి తేనెగూండ్లను తోటలోను, ఉద్యానవనాంతరములలోను పెట్టినచో తేనె విరివిగా సంపాదింపవచ్చును.

తేనెటీగలలో తిండివల్లనే లింగభేదం కలుగుతుంది. తేనెసంపాదించు ఈగల 'గ్లాండ్సు'లో తయారైన రోయల్ జల్లీ అనే పదార్థం పెట్టి పెంచినచో తేనెటీగగ్రుడ్లు రాణిఈగలగును.

తేనెసంపాదించే పనివాండ్రుగా మారాలన్న గ్రుడ్లకు మూడురోజులు 'రాయల్ జల్లీ'యు తరువాత బీబ్రెడ్'ను పెట్టును.

పోతుటీగలు సాధారణముగా రాణియీగ పెట్టు ధారణశక్తిలేని గుడ్ల సమూహమునుండి బయలుదేరును. వాటికి మూడురోజులు రాయల్ జల్లీయు, మూడున్నరరోజులు బీబ్రడ్డ రోయల్ జల్లీయు కలిపిపెట్టును.

అయితే ఆహారం తేడావల్ల లింగభేదంవస్తుందా అని సంశయం కలుగవచ్చు. కాని 'ఇ' విటమినును హార్చివ్రాస్తూ డాక్టరు డబ్లుయు. కె. పాక్సు శాస్త్రజ్ఞుడు యిట్లా వ్రాసాడు. 'రాణియీగ రెండు విధములగు గ్రుడ్లను పెడుతుంది. ఆ గుడ్లు అవసరమునుపట్టి శ్రామిక తేనెటీగలుగాను, రాణీఈగలగాను, పోతుటీగలుగాను మారగలవు. ఇది తెలిసినవిషయమే.

రాణియీగ అగుటకు ఆగ్రుడ్లకు పెట్టే 'రాయల్ జల్లీలో 'ఇ' విటమిను మిక్కుటముగా నున్నట్టు స్పష్టపడింది. ఇతర కారణములు ఏమైనావుండవచ్చుగాని అది తినే ఆహారంవల్లనే అది అద్భుతగర్భధారణశక్తి కలిగివుంది.

రాణియీగ లెక్కలేకుండా తన సంతతిని వృద్ధిచేయడానికి గ్రుడ్లను పెట్టుటే కాకుండా అందులో రెండు రకాల గ్రుడ్లనుపెట్టగలశక్తి కలిగివుంది. ధారణశక్తి కలవి కొన్ని, లేనివి కొన్ని.

ధారణశక్తికల గ్రుడ్లనుండే రాణియీగలు, శ్రమపడే వర్కరు యీగలు బయలుదేరతాయి. రెండవరకం గ్రుడ్లనుండియే సోమరులైన పోతుటీగలు పుడతాయి. వీటిపని తేనెనుతిని గూడును వెచ్చచేయడంతప్ప యింకేమీలేదు. తేనెటీగలుగను, రాణులుగను తయారయ్యేగ్రుడ్లలో ఏమీ భేదంలేదు. కాని ఆగ్రుడ్లుతినే ఆహారమువల్లనే రాణులుగాను, లింగభేదములేని యీగలుగను తయారగుచున్నవి.

విషవృక్షముల పువ్వులనుండి మధురరసమును త్రాగుట తేనెటీగలకు అపాయకరము అంటారు. కాని మదరాసు రాజధానిలోను, మైసూరు, తిరువాన్కూరు ప్రాంతములందు తేనెటీగలకు అపాయకరమైన అట్టి విషవృక్షములు ఏమీ శాస్త్రజ్ఞులకు అందలేదు.

సింహళద్వీపంలో రబ్బరుచెట్లు పూసేకాలంలో తయారైన తేనె కొంచెం వగరుగావుంటుంది. అయినా తేనెటీగలు ఆరోజుల్లో తమ తేనెసంపాదనను మానవు. అవి ఆకాలమందే తేనె విరివిగా ఆర్జిస్తాయి.

Pontus అనువృక్షపుష్పముల నుండి సంపాదింపబడ్డ తేనెతాగి కొందరు సైనికులు తందనాలాడినట్టు జనోఫాన్ మహాశయుడు వ్రాశాడు. ఆ తేనె అంత ఉన్మాదం పుట్టిస్తుందన్నమాట

ఆరిస్టాటిల్ అనేవాడు కొన్ని తేనెలు పిచ్చివాళ్ళను మంచివారిగాను, మంచివాళ్ళను పిచ్చవాళ్ళగాను చేస్తాయి అని వ్రాశాడు.

మనుష్యులనే కాదు తేనెటీగలను కూడా కొన్నిరకముల పూలు మత్తు ఎక్కిస్తాయి. గోధుమచేలుపూతమీదఉన్న తరిని తేనెటీగలు మంచిచురుగ్గానూ, పౌరుషంగాను వుంటాయి. Meadow saffron, Colchiumautumnaie మొక్కలయొక్క మధురరసము తేనెటీగలను మత్తు ఎక్కిస్తుంది.

ఆమత్తుకి కారణము ఆమధురరసములో లీనమైయున్న సారాయిగుణమే. అందుచే ఆచెట్లను తేనెటీగలు సాధారణంగా దర్శింపవు. వాటికి తాగుడంటే అంత అసహ్యం గాబోలు—

మొత్తంమీద హిందూదేశంలోని యీగలకు తాగుడుగుణం తక్కువ.

ఈ తేనెటీగలు కూడబెట్టిన తేనెకు హిందూవైద్యశాస్త్రమున అగ్రస్థానముకలదు. కాబట్టే తేనెకు విలువ అధికము.

## బొబో అని కోళ్లను పిలిచినట్లే ఒఒ అని మొసళ్లను పిలవవచ్చు.

# పిలిస్తే పలికే మొసళ్లు

పాఠకుడా!

ఇది కట్టుకథగాదు. భారతదేశంలోని కోటానగరానికి సమీపంలోవున్న అబేదా సరస్సులో పిలిస్తే పలికే మొసళ్లువున్నాయి. నీవు పిలిస్తే అవి పైకివచ్చి నీవు పెట్టే ఆహారాన్నితిని తిరిగి నీటిలో మునిగిపోతాయి. వెళ్ళి చూచివస్తావా? ఈలోగా ఈవివరాలు విను.

'బొ! బొ' అని కోళ్ళను పిలిచి ఆహారంపెట్టడం అందరూ ఎరిగిన విషయమే. అట్లాగా మొసళ్ళను కూడా పిలిచి ఆహారం పెట్టవచ్చు నా?

ఒక సరస్సుఒడ్డున నిలచి మొసళ్ళను కేకవేయండి. మీ పిలుపు నకు ఆమొసళ్ళు నీటిపైకివచ్చి తల లు ఎత్తి కోళ్ళవలె మీవైపునకు ఉఱకలువేసుకుంటూ వస్తాయి.

ఇదియేమిటి మొసళ్లు పిలిస్తే రావడం ఏమిటిఅని ఆశ్చర్యం కలుగవచ్చు, కాని ఇందులో ఏమీ యింద్రజాలంలేదు. ఇది కట్టుకథ కాదు. ఈకథను నమ్మించడానికి నేనేమీ మంత్రం వేయడంలేదు.

పవిత్రమైన కర్మభూమి అగు హిందూదేశమున మొసళ్ళను పెంచు కొలనులు సుమారు ఒక అరడజను వుంటాయి. వాటియందు అవి శాంతముగా, సౌఖ్యముగా జీవిస్తాయి. ఆ మొసళ్ళను పిలవడం తడవుగా సరస్సు అడుగుననుండి పైకివచ్చి మీకు ప్రత్యక్షమవుతాయి.

అట్టి మొసళ్ళకు నిలయమైన సరస్సులలో 'అబెడా' సరస్సు ఒకటి. అది 'కోటా' రాజ్యంలోవుంది. 'కోటా' బొంబాయికి సుమారు 500 మైళ్ల దూరాన ఈశాన్యదిక్కుగా ఒక అరణ్యంలోవుంది. ఆ అరణ్యంలో అడవిజంతువులవేట నిషేధింపబడినది. కాబట్టి అందులో అడవిమృగములు విస్తారముగా వుంటాయి.

ప్రకృతిసౌందర్యము చూడ అభిలషించువానిని ఆ అబెడ కొలను కూడా ఆకర్షించును.

ఆకొలను కోటానగరపు రైలు స్టేషనుకు ఆరుమైళ్ళ దూరంలో ఉన్న చంబల్ నదికి ఆవలిప్రక్కన ఉన్నది. ఆసరస్సునకు పోవుమార్గము అతిమనోహరమైన ప్రకృతి శోభకు పుట్టినిల్లు. దారిలో లేళ్ళ గుంపులు, పొదలు మానవుని ముగ్ధుని చేస్తాయి. ఆసరస్సు పరిసరములు ఆహ్లాదకరంగా వుంటాయి. ఒకమూల పాడు దేవాలయంకూడా వుంది.

అక్కడ నెమళ్ళకూతలు, కోతుల కిచకిచారావములుతప్ప ప్రకృతి నిద్రపోతున్నట్టు వుంటుంది. కాని ఆదేవాలయం మెట్లవద్దకుపోయి టార్జహానులాగ ఓఈ' ఓఈ' అని పిలిస్తే మొసళ్లు పరుగెడుతూ వస్తాయి. ఆ సరస్సు కాపలామనిషి సహాయంలేనిదే వాటితో మెలగడం కొత్తవారికి కష్టం.

పెద్ద కొమ్ములవంటి తలకాయలు, గోడకుపెట్టిన గ్రుడ్లవంటి గ్రుడ్లతోనూ ప్రత్యక్షమౌతాయి నీటిమీద ఆమొసళ్లు, అంపంలాంటి తోకను ఆడిస్తూ మెట్లవెంపువస్తాయి. వొకదానివెనుక వొకటి ఆమెట్లు ఎగబ్రాకుతాయి. ఆహారంకోసం కంగారు చేస్తాయి. అందుచే వాటిని పిలుచుటకు ముందే వాటికి పెట్టదలచిన ఆహారం సిద్ధంచేసుకొని వుంచుటమంచిది. లేకుంటే ప్రమాదం. చాలావంకు ఆ మొసళ్లు చనువుగా దరిచేరి వాటివంతు వా

కి ముట్టగానే నోటకరచుకొని ఆహారం మింగడానికి గప్పుచిప్పుగా టిలోకి జారిపోతాయి.

కాని వానిలో తిండిపోతు మొసళ్లు కొన్ని వుంటాయి. అవి దొరికినదాన్ని మ్రింగి యింకా పెట్టమని కారిస్తాయి. వాటికి మెత్తటి ప్రేపలమాంసమంటే మహాయిష్టం. తెచ్చిన ఆహారం అయిపోయిందని తెలిసేవరకు అవి అక్కడనుంచిపోవు.

ఆహారం అయిపోయిందని తెలియగానే నీటిలోకి జారిపోతాయి. మళ్ళీ కొలను అతినిర్మలంగా కనుపిస్తుంది.

దేవాలయపు మెట్లమీద ఆహారంకోసం వేచియున్నప్పటి వాటి సుందస్థితి చూస్తే వాటిని ఆడించాలని బుద్ధిపుడుతుంది. కాని అవి ఆహారంకోసం నోరుపూర్తిగా తెరచి బగళా దౌడలు తాటిస్తూవుంటే చూచేవాళ్ళకు భయంపుడుతుంది. ఆసమయంలో ఆ మొసళ్ళ వేపు చూస్తే గాభరాపుడుతుంది. ఆహారం నోటికి అందకపోతే అందించేవానినే దిగమ్రింగుతాయేమో అనిపిస్తుంది.

మొత్తంమీద మొసళ్ళను బాధించకుండా వాటికి ఆహారం పెడుతూవుంటే అవి చాలా చనువుగా వుంటాయి. కాని వాటిని నమ్మకూడదు. వాటితో స్వేచ్ఛగా మెలగకూడదు. అవి మనుష్యమాంసము మరికిందంటే వదిలిపెట్టవు.

జాగ్రత్త!

# ఆంధ్రపౌరుషము

చెరిగిపోవింక తెలుఁగుల జీర్ణకథలు,
అవ్వి మాహృదంతరమున నణఁగియుండె;
మాదు ప్రాచ్యపౌరుషవహ్ని-మావిదగ్ధ
నాగరీక కళాప్రౌఢి మానందగరిమ.
తలచుకొను నపుడెల్ల సంతాపవహ్ని
హృదయముఁ గలంచి-గర్వమ్ము పదునుగొల్పి-
కనుగొలంకులఁ జిగిరించి-కంఠనాళ
ములను బెగిలించి - నృత్యంబు కలనదేల్చు.
పిరికిపాలతో మాతల్లి పెంచలేదు—
తల్లియొడిలోనఁ బెటిగెడి తరుణమందె,
పదును కత్తులరాపుడుల్ కదనమందుఁ
దాండవించుట, గనలేదె ధైర్యగరిమ.
నడుముబిగియించి—మాయమ్మ-
"నాయనా! ఇదిగో—
ఇదే చూరకత్తి!
పదిలముగ ధరియించు నీ చిరుకరమందు-
ఏది- త్రిప్పుమిపుడు-
నాతోడఁ బోరాడు-
మిఝ్లై-
భళిర-
త్వత్ పదాంకిత మొనరించు దండిమగల
మాళివికసితమాణిక్యమాల లింక"
ననుచు, బెంపొందువారెల్ల చనిరి దివికి,
వారి సంతతి కొకయింత ప్రజ్ఞ లేదె?
వీరమాతలు పెంచిన, బెరుగు ధరణి
గడ్డిపోచకైన 'ప్రతిభ' కలదు- కలదు;
అవ్వి కత్తులై-కదనము నరిగళములఁ
జించి - చెండాడలేవె-యోజించి చూడ.

—జంపన చంద్రశేఖరరావు,
(బి.యే.-ఆనర్సు)

**బీదవాడు ధనికుని చేతిలోని కీలుబొమ్మవలెనుండకూడదు.**

# సాంఘికవాదము

"సాంఘికవాది సాంఘికజీవనమును పూర్తిగా అర్థముచేసికొని దానిలోని తప్పులనుదిద్ద యత్నింపవలెను."

రచయిత :

## శ్రీ గిడ్రాజు రామారావు

సమానపద్ధతులుకల్గి, సమాననీతినియమములుకల్గి, సమానధర్మముకల్గి సంచరించు మానవసమూహమే సంఘము. ఒకేమాదిరిపనిగాని, ఒకేమాదిరి భోజనముగాని, ఒకేమాదిరి వేషభూషణములు దాల్చుటగాని, ఒకేభాష మాట్లాడుటకాని సంఘనియమములు కాకపోవచ్చును. కర్మభేదము లుండవచ్చునుగాని ఫలస్వరూప మొక్కటిగానే యుండవలెను. సంఘమును కట్టుదిట్టములలో నుంచగలది శాసనము. శాసనములో కృత్రిమమున్న సంఘము చీలిపోవును. కులతారతమ్యములను గణించుటగాని, హిందూముసల్మానులను కట్టుదిట్టముచేయకపోవుటగాని, హీనజాతిని పైకి రానీయకుండుటగాని, రైతురాజుల పోట్లాటగాని శాసనములోని లోపములవలననే కల్గును. దీనివలననే ధార్మికమగు ఎడబంధములుకూడ కలుగును.

మానవసంఘము అనునది నిజముగా నున్నదా లేక ఎండమావులవంటిదా? సాంఘికనియమముల ప్రకారము ఆలోచించినచో నీనామము అడవిమృగములకు సరియగునేమో! జాతులవారు, మతములవారు, దేశములవారు, వృత్తులవారు, రంగులవారు, తిరిగి వీరిలో ధనవంతులు, బీదలు, వ్యాపారులు, వ్యవసాయదారులు- ఈవిధముగా నెంతమంది యున్నారు. అందరూ ఒకేదేశములో సమకూడియున్నారుకూడ. సంఘమని దేనిని పిలువవలెను?

సాంఘికసంఘటనములో భారతదేశము ప్రథమబహుమానమును పొందియున్నది. ఆ సంఘటనమే వర్ణాశ్రమధర్మములు. కాని కాలము సాగినకొలది యీ ధర్మము
వెనుకబట్టెను. వెంటనే సాంఘిక
సమస్య లేచి నిలువబడెను. భారతీ
యసంఘమున కన్నిటికంటె ఆధ్యా
త్మికజీవనము ప్రధానము. అ
యడుగంటిననాడు మనవారు
తుకు తెరువులను జూచుకొనసాగిరి
ఎవరికివారే త్రొక్కుకొనుచుం
సంఘ మెట్లేర్పడగలదు?

ఇక విదేశీయులసంగతి విచి
ముగా మారిపోయెను. ఐశ్వర్యమ
వలన సంఘమేర్పడునని యొకడు
కూలినాలిచేసికొని జీవించవలెన
మరియొకడు, రాజ్యము విస్తారమ
చేసికొనవలెనని ఇంకొకడు. ఈవి
ముగా తలకొకవాదమును లేవదీ
శాసనములను పుట్టించిరి. పుస్త
ములను తయారుచేసిరి. ఏజో
పట్టనివారు తటస్థవాదులు. దా
న్యముతో తిరగబడువారు సైని
వాదులు. వీరందరిలో వ్యాపా
వాదులని ఒకక్రొత్త తెగయున్న
వీరు కర్తవ్యక్షేత్రమున బయ
దేరి అధికారక్షేత్రమున నిలు
బడిరి. కొంతమంది సనాతనధ
సాంప్రదాయకులు. వీరిలో తి
నైతికాచారములనుబట్టి భేద
లున్నవి. క్రీస్తు, హిందూ, మ
మ్మదు ధర్మావలంబకుల కొకరికొ
రికి బడదు. ఈర్ష్యచే వారి
వారికే బడదు.

క్రీస్తును నమ్మువారు తమ

...ాము రాజ్యకాంక్షచే కుమ్ము
...ాడుచున్నారు. బుద్ధమతావలంబ
...లు అహింసాసిద్ధాంతమును ఆవిరి
...ంద లేపివేయుచున్నారు. వీరికృ
...్యముల కేసంప్రదాయము, ఏధ
...్మము అడ్డుపడగలదు? హిందువుల
...కేవుడు కోట్లకొలదిగల తోడిహిం
...వుల నస్పృశ్యులుగా జూచునే,
...క సంఘమును సమకూర్చుట
...వ్వడితరము ?

ధర్మముగాని మతముగాని ఆ
...ారవ్యవహారములుగాని సంఘ
...ిను త్రాడుతో కట్టివేయజాలవు.
...నిని కట్టివేయుటకు మరియొక
...స్తువు కావలెనని చాలమంది యభి
...ాయము. అట్లయినచో భారత
...కేశ మింతవరకు తప్పత్రోవలో
...న్నదన్నమాటేనా? మన కిప్పుడు
...ండేప్రశ్నలు. ముక్కు ముడుచు
...ొని మోక్షమున కెదురుచూడ
...లెనా, స్వాతంత్ర్యసమరములో
...డి కారాగారము నాహ్వానింప
...లెనా? ఈరెండుపద్ధతులు సదా
...ారము లేగదా—కాదనువా రుం
...రు. కాబట్టి మానవజాతిని రెండు
...ంఘములుగా చేయవచ్చునన్న
...ాట. ముక్తిస్వాతంత్ర్యము: దేశ
...్వాతంత్ర్యము.

ముక్తి లేదు, ఏమీ లేదు దేశ
...్వాతంత్ర్యమే అంతయును అనేవా
...న్నారు, ఆధ్యాత్మికముగా అవ
పడువారున్నారు కాని సాంఘిక
...ాతావరణ మనుకూలముగా లే
...న్నచో, దీని ననుకూలముగా వా
...తమ్మునతామే దిద్దికొనవలసి యు
న్నది. సంఘములోకూడ సదా
చారమునకు తావున్నది. దీని సహా
యమువలన సంఘమును మరల్ప
వచ్చును. శాసనములు పుట్టింప
వచ్చును.

ఆచారములేక విచారములేక
ధర్మములేక ధనమే దైవమనువారి
వద్ద శాంతమను పదము నలిగి
చచ్చిపోయినది. సంఘము ఊరు
పేరులేకుండ పోయినది. తుదకు
దీని పర్యవసాన మెట్లు పరిణమిం
చిన దనగా ఒకడు తినిన మరియొ
కడు మాడుచున్నాడు. మన దేశ
మున ఖద్దరు ఉద్యమము ప్రారం
భించినవెంటనే విదేశములలో పని
లేనివారెక్కువయైరి. ఇది విచిత్ర
మైన త్రాడులేని బంధన! మానవ
సంఘమొక్కటే, ఏవిషయములో
నెదురు సంచరించినను ప్రాణసం
కటమని నిరూపించుట కిది యుదా
హరణము.

సంఘమేర్పడుటకు మరియొక
పద్ధతిని జూతము. అందరకు నందు
పాటులోనున్నవి నాగరికత, సభ్య
తలు. ఇందులో తూర్పుపడమర
లు వేరు. ఉత్తరదక్షిణములు వేరు.
భేదము ముదిరినకొలది స్వార్థము
ముదురుచుండును. స్వార్థము ముది
రిన ద్వేషము. తుట్టతుదకు యుద్ధ
ము. కాబట్టి ఇదియును లాభము
లేదు. సమానశిక్ష మానవుల నొ
క్కటిగా జేయగలదా ? శిక్ష స్వ
తంత్రమైనదిగాదు. ఏదేశమునకు
తగిన శిక్ష వారిది. స్వాధీన దేశములు
బానిసశిక్ష నభ్యసించి కవులను, చి
త్రకారులను తయారుచేసి ఏమిచే
యగలవు? కావున నిదియు పనికి
రాదు.

ఇది కలికాలము గనుక సమత్వ
మేర్పడదు, అంతయు వినాశమునకే
వచ్చినదని పల్కువారుందురు కాని
ఒక సంఘము మరియొక సంఘ
మును పీడించుకొని తినుట మనము
చూచుచునే యున్నాము. అనగా
ఆసంఘమునకు బలమున్నదన్నమా
టేగదా? దాని నెట్లు సంపాదించి
యున్నది చూడవలెను. సంఘే
శక్తిః అన్నారు. మనుష్యుడు పూ
ర్వసంచితకర్మమును సైతము ప్ర
యత్నమువలన తప్పించుకొని సఫ
లుడు కావచ్చును. అందుల కతడు
స్వతంత్రుడు. అట్లయినచో దుఃఖ
కారణములగు దాసత్వము, అస్పృ
శ్యత, దారిద్ర్యము మొదలగు కృత్రి
మదుఃఖములను మరల్చుకొనుట
కు మనుష్యుడు స్వతంత్రుడుకాడా?
ముమ్మాటికిని స్వతంత్రుడే. ఇదియే
మహాత్ముని సిద్ధాంతము. దీనివల
ననే సంఘము శక్తిగలది కాగలదు.
ధనవంతులు బీదలకు దానధర్మము
లు చేయవలెనని హిందువుల యా
చారమైయున్నది. సామ్యవాదము
యొక్క సౌమ్యపద్ధతి ఇది. ఈ
దానకర్మ భాగ్యవంతుల పాలిట
భీమావంటిది. ఏలయన బీదలవల
ననే వారిభాగ్యము సురక్షితముగా
నిలువబడును. లేనిచో నేటి యూ
రోపుపద్ధతిగా మారిపోవును. ద్రవ్య
మున కధికారి మానవుడు కాదు. దే
శము. ద్రవ్యమును దేశమున వెద

జల్లుపద్ధతినే పరిశ్రమాభివృద్ధియని పేరుపెట్టిరి. ఇందువలన దేశములో కరువు లుండవు. గృహకలహము లుండవు. సంఘము ఒక్కటిగా నుండుటకు ఈషణత్రయములను విడవవలెనని మన పెద్దలు చెప్పినారు. ధనేషణతో దేశములంతరించి పోవుచున్నవి. ఇప్పటి కెన్నియో పోయినవి. దారేషణతోనే మన భారతదేశ మీస్థితిలోనున్నది. (పృథ్వీరాజు జయసింహులు రాణీ సంయుక్తకై పోరాడుకొని తురుష్కుల నాహ్వానించిరి) సరే! పుత్రేషణకొరకు చెప్పనక్కరలేదు. పురాణముల నిండుగా నీకథలే! కోర్టులనిండా దత్తతదావాలే! మరియొక విషయము వర్ణాశ్రమధర్మములు. ఒకరిపనిలో మరియొకడు జొరబడినను, ఒకవయస్సులో చేయరాని పనిచేసినను సంఘము తలక్రిందై పోవును. ముసలివాడగు శంతనునికి పెండ్లిపిచ్చ పుట్టినప్పుడే భీష్ముడు బ్రహ్మచారి యైపోయినాడు. కథ అడ్డముతిరిగినప్పుడు భీష్ము డెంతటివాడైతేనేమి? ఇంకొకటి: ఆరోజులలో ధనముమీద విద్యకు అధికారమిచ్చియున్నారు. కనుకనే రాజశాసనముమీదకూడ బ్రాహ్మణాధికారము చలామణి అయ్యేది. అందువలన ప్రజలు చల్లగా బ్రతికేవారు. ఇప్పుడుకూడ రామరాజ్యమని మనము చెప్పుకొనుచున్నాము కదా! అయితే ఆ బ్రాహ్మణత్వము వేరు.

రాజుచేగాని శాసనసంఘముచేగాని ప్రజలు పరిపాలింపబడుచుందురు. సంఘములో ప్రజాప్రతినిధు లుందురు. ప్రతినిధుల నెన్నుకొనుటలో ప్రజలలో మతభేదములు పుట్టును. కాబట్టి రాజనైతికసామ్యమును సమకూర్చుటలో శాసనమెంతవరకు సహాయకారిగా నున్నదనిన సందేహింపవలసి యున్నది.

ఇటలీలోని ఫాసిజం, జర్మనీలోని నాజీజం, రష్యాలోని సమష్టిసామ్యవాదము, ఇంగ్లండులోని లోకతంత్రవాదము. అమెరికాలోని సంయుక్తరాష్ట్రవాదము. జపానులోని ఏకసత్తాధికారవాదము మొదలైనవన్నియు సాంఘికవాదములే. వీనిలో ఒకదాని కొకటి పడదు. దేని విధానము దానిదే. ఎవరిదారి వారిదే. ఇక వీనివలన ప్రపంచమున మానవసంఘములో శాంతి కుదురగలదా?

శాంతిని స్థాపించుటకై శాంతివాదు లనువారున్నారు. వీరు సన్యస్తశస్త్రులు. నిరస్త్రీకరణము వీరిమతము. కొన్నివేల సంవత్సరములక్రింద ప్రపంచమెట్లుండెనో అట్లే ప్రపంచమును నేడు తయారుచేసినచో శాంతియలవడునని వీరియుద్దేశ్యము. కత్తిపట్టుకొని దుముకురోజులలో నాగలి పట్టుకొని ఎవ్వడు దున్నుకొనగలడు? స్వతంత్రపక్షులవలె గాలిలో నెగురు వీరినాగరికత పోగొట్టుకొనవలెననిన ఎవ్వడు ఒప్పుకొనును? లాభములనిచ్చు యంత్రశాలలను మూసివేయవలెనన్న ఏ ఐశ్వర్య
వాది ఒప్పుకొనును? కాబట్టి శా
వాదుల ప్రయత్నముకూడ వ్య
(శాంతివాదమును గూర్చి విపుల
గా మరియొకసారి విన్నవించుక
దును.)

యూరోపు ఖండములో శా
ము భగ్నమైపోయిన రోజులలో
రలదానిని సమకూర్చుటకు పు
యవతారపురుషులలో కార్లమ
ర్క్సు మొదటివాడు. ఇతడు వి
నము నభివృద్ధిచేయవలెనని పూ
కొనెను. బీదవాడు ధనికునిచేతిలో
బొమ్మవలె నుండకూడదని
తని యుద్దేశ్యము ఇతడు రో
కారణమును తెలిసికొనజాలక
ధనుబట్టి మందునిచ్చు వైద్యు
వంటివాడు. ఈ వైద్యమువ
రోగము తగ్గినతగ్గవచ్చు. లే
నిలువబడవచ్చును. కాని మరి
చెడిపోదు. సాంఘికవాది సాంఘి
జీవనమును పూర్తిగా యర్థ
చేసికొని దానిలోనితప్పులను
యత్నింపవలెను. దీనిని చారి
భౌతికవాద మందురు. దీనిని మన
అనాత్మవాద మందుము. దీని
ఔదార్యము, తపస్సు, జ్ఞాన
లకు చోటుగలదు. బృహస్పతి
ధించిన యనాత్మవాదమునకు దీ
సంబంధములేదు. కొందరు దీ
వస్తువాదమందురు. ఏవాదమై
నేమి సాంఘికోద్ధరణమే అసలై
వాదము.

జగత్తు నిత్యమనియు, ఈశ్వర
త్రిలోకసాక్షియనియు మారు
ఒప్పుకొనడు. మనము చూచు వ

యొక్క ఆకారము మనమెదడు ౕ పడినప్పుడే కనుబడునుగాని ండదులో పడలేదుగనుక ఆవస్తు లేదననుట తప్పు. అనుసిద్ధాంత తడు ఒప్పుకొనడు. జగన్నిర్మా ములో యుద్దేశ్యమున్నదనినను, ది వృద్ధిపొందుచుండుననిన యీ ు విశ్వసింపడు. అతడు జగత్తును హాటర్' అనును. దీనిని మనము కమందుము. దీనిలోనిది ప్రకృతి. ె సత్యమైనపదార్థము. ఇది స్తుగాని చిత్తుగాదు. సత్‌ను ం శ్చాత్యులు 'మాటరం'దురు. కృతిలో అవస్థాభేదము లున్నవి. యవస్థలనుగురించి యుక్తియుత ంగా మాట్లాడు యుక్తివాదు లున్నారు. వీరికి ప్రతివాదులున్నారు. ఎన్నియున్నను సృష్టియున్నది. ఎప్పుడో పుట్టినది. అనేకరకాల వాదనలు న్నవి, దీనివికాసమును గురించి. మనవాదము మనది. దాని నడక దానిది. అవసరములైనచో ప్రకృతి కనుకూలముగా వాదములను త్రిప్పుకొనవలసియున్నది. కాబట్టి మార్క్సు అప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి తనవాదమును బలపరచుకొనెను గాని ప్రకృతికి విరుద్ధముగా తనత్రోవ తాను పోలేదు.




ఆదినములలో ప్రపంచమునందంతటను రాజ్యము లేర్పడి యుండెను. వ్యవసాయమువలన, వ్యాపారమువలన ప్రజలు ధనముగడించుకొనుచుండిరి. విదేశములలో కూడ వ్యాపారముచేయ పోవుచుండిరి. అచ్చట పోటీలేకుండ వ్యాపారము సాగుచుండెను. స్వదేశములు తగినసైన్యముతో బందోబస్తుచేయబడెను. కార్మికసంఘము లేర్పడెను. వ్యాపారుల సంఘము లేర్పడెను. యంత్రము లధికము కాజొచ్చెను. నాగరికత యభివృద్ధి బొందుచుండెను. విజ్ఞానము వృద్ధి బొందసాగెను. విరివిగా మతప్రచారకులు బయల్వెడలిరి. పోలీసులకధికారము లీయబడెను. కాలేజీలు స్థాపింపబడెను పెట్టుబడిపెట్టుటకు బ్యాంకులు నెలకొల్పబడెను. సర్వే గుణాః కాంచన మాశ్రయంతే అన్నారు. ధనమున్న నెన్నిపనులైనను చేయవచ్చును.

అయితే ధనికు లెక్కువయైన బీదలుకూడ ఎక్కువగుదురుకదా! ధనము పెరుగదుగాని జనసంఖ్య పెరుగకుండునా? పెరిగిన జనసంఖ్యకు ధనము చాలకపోయినచో దరిద్రముకాక మరేమగును. ధనము వలన నష్టముం గ్రహించి ధనమక్కరలేదనువారు, కావలెనను వారు అని (Haves and Have nots) రెండు వర్గములు ఏర్పడినవి. ప్రపంచ మెన్ని మార్పులు పొందియున్నదిగాని యీ వర్గసంక్షోభముమాత్రము తగ్గునట్లు కనుపించదు. ప్రతివర్గమువారు శాసనముపై యధికారమును సంపాదించుకొని కత్తులు నూరుకొనుచున్నచో వీరితిగాదా ఎవ్వరు తీర్పగలరు?

కొందరు దేశములో ధనవంతులున్న దేశారిష్టమని పలుక నారంభించిరి. ధనవంతులన్న కేవలము ద్రవ్యమునే నిలువజేసికొను వారుకాదు. అన్నివిధముల ఐశ్వర్యమును సంపాదించియున్న వారు కూడ ధనవంతులే లేక భాగ్యవంతులే. సమాజవాదులు నిజసంపత్తినే యొప్పుకొనరు. ప్రతిమానవుడు కొంతవరకు భాగ్యమును పొందియుండవలెగాని అంతకుమించి యుంచుకొనరాదు. వ్యాపారమున లాభమువచ్చుచో, తనకు నియమించిన లాభముమాత్ర ముంచుకొని మిగిలినది మరల దేశములో విడిచిపెట్టవలెను. అట్టివారిని రక్షించుటకై శాసనము తగు సహాయము చేయును. పోలీసులు, రైళ్లు, వై

ద్యవిద్యాలయములు మొదలగు అనేక సౌకర్యములను చేయుదురు. కాబట్టి దేశక్షేమమును కోరువాడు ధనమును ఇనుపపెట్టెలో నుంచుకొని పూజించుకొనరాదు. సర్కారు విధించుపన్నులు ఇచ్చుచుండవలెను. ఈపన్నులు ప్రజాక్షేమముకొరకే ఖర్చుపెట్టబడును. వారసులులేని ఆస్తి సర్కారునకు దక్కును. పనికిరానివాని యాస్తికూడ సర్కారునకు చెందును. అతడు కష్టించి జీవించునంతవరకు సర్కారుచే పోషింపబడుచుండును. అన్నియు బాగుగనే యున్నవికాని రాజ్యమును పాలించు రాజుమాత్రము ధనవంతుడుగా నేల యుండవలెను? పరిపాలనముచేతగాని రాజు శాంతిస్థాపకు డెట్లగును?

ప్రభుత్వమనేది రాజరికమును చెలాయించుటకొరకు మాత్రమే పుట్టలేదు. సంఘమును అన్నివిధముల చక్కని కట్టుబాట్లలో నుంపగల ఒక పెద్ద సంస్థయే ప్రభుత్వము. శాంతిస్థాపనకై భగవంతుడెన్నివిధముల ప్రయత్నించుచున్నాడో అన్నివిధముల ప్రభుత్వము ప్రజలను పాలించుచుండును. కాబట్టి రాజు భగవంతుని ప్రతినిధి వంటివాడు. ఇతడు ప్రజాప్రతినిధికూడ. ఇతనిశక్తి జనసామాన్యముయొక్క సంపూర్ణమైన కోరికపైననే యాధారపడియుండును. వారికి విరుద్ధముగా నడువ, నుడువజాలడు. అట్టి రాజునకు ధనమెందులకు?

సాంఘికవాదులకు రాజు పనికిరానిచో పక్షభేదములు లెక్కించు శాసనముమాత్రము పనికివచ్చునా? పక్షభేదములవలననే గృహయుద్ధములు కలుగును. ఇప్పటి కెన్నియో కలిగినవి. కలుగుచున్నవి. ఇక ప్రపంచమున నొక సంఘముండునా– శాంతముండునా? సంక్షోభము పుట్టినగాని శాంతమలవడదను మన ధర్మశాస్త్రము నొప్పుకొనక తప్పదు. సంక్షోభమనగా విప్లవము. అనగా శక్తిగలవానిని శక్తిచేతనే జయింపవలెను. దీనిలో జరుగుహింస పాపముగా పరిగణింపబడదు. కాని లెనిన్, మార్క్సు వంటివారు హింసను ప్రోత్సహింపలేదు. లెనిన్ మాత్రము 'అవసరమైతే' అని చవిచూపించినాడు. మహాత్మాగాంధీగారు కేవలము అహింసావాది. సాంఘికవాది పక్షభేదముల నొప్పుకొనడు. ఒక మనుష్యునకు మరియొకడు లోబడియుండుట ఒప్పుకొనడు. విప్లవమే శాంతికి మార్గమగును కాని కొందరు దీనినికూడ ఒప్పుకొనరు.

ఉత్పత్తి, వినియోగము, వితరణము ఈమూడును సాంఘికవాదములోని ముఖ్యవిషయములు. వస్తువులను తయారుచేసికొందురు— వాడుకొందురు– అమ్ముకొందురు. అందరును ఒకేమాదిరిగా జీవింతురు. ఇటలీ జర్మనీ రష్యా జపాను వారి యాశలివియే. కాని నేటి యీ యుద్ధకారణము సామ్రాజ్యవాదముగాని సాంఘికవాదము కాదు. శాంతివికాసమే సమాజవాదము

యుక్క ఆదర్శము. సమాజవాదు
ంకూడ యంత్రముల నుపయోగిం
రు. ఇది కేవలము స్వరక్షణము
రకే! స్త్రీపురుషులకు సామాన
క్కుల నొసంగువాడు సమాజ
ాది. ఇతడు లౌకికధర్మమునే ప్ర
ారమును చేయును. మూఢనమ్మ
ములను తొలగించి దేశకాల పరి
తులను బట్టి ధర్మములను మా
ర్చుచుండును.

రకరకములగు మతములను త
ంచి ఒకేమతమును, ఒకేసంస్కృ
ని, ఒకేభాషను, ఒకే దేశమును చే
యప్రయత్నించును. సాంప్రదాయక
మైన జగడములనుతగ్గించి వేయును.
శ్రావిభాగము నభివృద్ధిచేయును.
నసామాన్యము యొక్క హృదయ
ముల లేపు నట్లు చేయుపుస్తకముల
క ప్రచురింపజేయును. నాటకములు,
థలు ప్రజలలోని తేజస్సును ప్ర
ాశింపజేయునట్లు ప్రాయించును.
ారు స్వయముగా చూచినగాని
వేనిని బయటకు పోనీయడు. దేశ
ముననుశాంతము ప్రజ్వరిల్లుటచే కో
ర్కెలు తగ్గించును. ప్రతివాని జీవిత
ము ప్రభుత్వముచేతిలో నుండుటచే
ర్వ డేపనిని చేయుచున్నాడో దాని
తెలిసికొనియే యుండును. ఇందు
లన దొంగతనము, వ్యభిచారము,
ాదము, సోమరితనము నశించిపో
ను. సాహిత్యము, కళలు అభివృద్ధి
చుగును. దేశమనగా ప్రజలనియు,
దేశమే స్వర్గమనియు సాంఘికవా
దులు బోధింతురు.

సమాజవాదము ప్రబలుచున్న కొలది ఐశ్వర్యవాద మోర్చుకొన లేదు. సమాజవాదులకు ఐశ్వర్యవాదులవలన నెప్పటికైనను ప్రమాదము కలదని వీరు స్వరక్షణమునకై సైన్యము నుంచుకొందురు. కోటలు కట్టుకొందురు, జాతీయతాప్రేమను పురిగొల్పుదురు. సాంఘికవాదము ఐశ్వర్యవాదగర్భమునుండియే పుట్టినది. పెరిగి పెద్దదైనదికాని తల్లిపోలికలు పూర్తిగా వదలిపో లేదు.

సమాజవాదులు జీతముల సరిగానీయరను అపవాదొకటి యున్నది. కాని మనుష్యునకు సరిపోవు గ్రాసము లభించుచున్నపుడు ఎక్కువజీతము లెందుకు? బ్రతికి నన్నాళ్లు దేశసేవచేయుచు బ్రతుకవలెను గదా– ధనముగడించి నిలువచేయుట ఎవరికొరకు? సంఘసేవకై బయల్వెడలిన మతగురువులు, వాఙ్మయబ్రహ్మలు, రాజకీయవేత్తలు, గణితశాస్త్రజ్ఞులు, చిత్రకారులు మొదలైనవారే జీతముల కాశపడి ప్రజాసేవకై సిద్ధపడిరి.

సమాజవాదమువలన శాంతమలవడుట కాశలు కనుపించుచున్నవి. భారతదేశమునకు ఆధ్యాత్మికవాదమే శాంతమును కూర్పగలదని మన మనుకొందుము. కాని మనుష్యుని పృథ్విని వేరుచేసిన తత్త్వము మనలో నేదియును లేదు. కాబట్టి పృథ్వితో సంబంధ మున్నంత కాలము మానవుడు పనిచేయక తప్పదు. అతడు చేయవలసినవి చాలగలవు. వేళపాళ లేక ఏశంకరభాష్యమునో గంగయొడ్డున కూర్చుండి వల్లించుకొనుట ఆధ్యాత్మికమా లేక ప్రజాసేవచేసి ముక్తి పొందుట ఆధ్యాత్మికమా? సనాతనులు నిర్ణయింతురుగాక!

## అగస్త్యుని లోపాముద్ర వరించినట్లు ఆమె మాజరిక్‌ను వరించిం

# మాజరిక్ దంపతుల పెళ్లికథ

"వలచి వలపించుకొని అన్యోన్యం వివాహం చేసికొన్న మాజరిక్ దంపతుల దాంపత్యం ఆదర్శ ప్రాయమైనది, ఆదరణీయమైనది."

రచయిత:

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యం.ఇ.

మానవులు సుఖించడానికే పెండ్లి చేసుకుంటారు. ఆ పెండ్లిలో చాలామంది తాము, ఉన్నస్థితికన్న ఎక్కువస్థితిలో ఉన్నవారినిచూచే ఎగబడతారు. దిగజారడానికి ఎవరు యిచ్ఛగిస్తారు. అందులోను స్త్రీలు ?

కాని కొంతమంది సంపన్ననారీమణులు శక్తిసంపన్నులైన బీదయువకులనే ఏరికోరి పెండ్లిచేసుకుంటారు- అంటే కష్టాలను కోరుకుంటారు అన్నమాట. కష్టాలుపడడమేకాదు భర్తను ఉన్నతస్థితికి తెస్తారు కూడాను.

ఉన్నతస్థితిలోనుంచి తన్ను వలచివచ్చి తన బరువును మోసిన భార్యవల్లనే జెకోస్లావాకియా ప్రత్యేకరాజ్యనిర్మాత అయిన ఒకవీరుని కథ ఇచట ప్రస్తావించి పై వాక్యాల్ని సత్యాలుగా నిరూపిద్దాము.

హంసతూలికాతల్పంమీద నిద్రించే వనితకు ఆమె తత్వమునకు తగినభర్త దొరకుటవల్ల కటికినేల మీద నిద్రకూడా స్వర్గతుల్యమగును. అట్టి త్యాగశిఖామణులలో అగ్రగణ్యురాలనతగ్గది గారిక్ చార్లెటీ- చెకోస్లావాకియా రాజ్యనిర్మాత మాజరిక్ భార్య. అతడు డిమాక్రేటునియంతలలో అగ్రసరుడైనాడు. ఆధనికురాలి సహచర్యము చేత.

ఆ దంపతులు ఎట్లు వివాహం చేసుకొన్నారో చూదాం.

ఆత్మస్నేహితుడు దొరకడం ఎంత అదృష్టమోకదా! తామస్ మాజరిక్‌కునకు యితరరాజ్యాలలోని విశ్వవిద్యాలయాలలో విద్య అభ్యసించాలని కుతూహలముండేది. కాని మింగ మెతుకులకే నానాఅవస్థలపాలయే మనిషికి యితరదేశాలు

వెళ్ళి చదువుకునేశక్తి ఎక్కడ?

అతనివద్ద ప్రవేటు చదువుకు
స్కెల్‌సిన్‌గర్ క్లాసులో ప్రథ
డుగా ఉత్తీర్ణుడైనాడు. ఆవిజయ
మేజరిక్‌నకు దారిచూపినది. అ
తో మాజరిక్‌నుకూడా [illegible]జగ
శ్వవిద్యాలయమునకు ప్రంపా
హాధ్యాయునిగా. వారు ఉభయు
మేడంగోరింగు అను ఆమె గృహ
లో బసచేసారు. అక్కడ యిం
యితరవిద్యార్థులుకూడా ఉన్నా
స్కెల్‌సిన్‌గర్ న్యాయశాస్త్ర
తీసుకున్నాడు. మాజరిక్ వేదాం
తీసుకున్నాడు. దానితో మాజరి
నకు ఆనగరములోని గస్టాబ్
ర్ అను వేదాంతి సహవాసం
భవించింది. అతనివల్ల దేవుని గ
ర్చి, ప్రకృతినిగూర్చి అనేకరహ
ములు తెలుసుకున్నాడు.

కొలదిరోజులలోనే అక్క
వున్న రష్యాసంఘంలో, యితర
ఘాలలో పాల్గొనేవాడు. ఉపన
సాలు ఇచ్చేవాడు. పత్రికలకు వ
సాలు వ్రాసేవాడు.

అక్కడ అప్పుడప్పుడే మొ
ఎత్తుచున్న చెక్కు జాతీయసం
మునకు దోహదమిచ్చి వృద్ధి
సాడు.

అట్టి సమయంలో ఒకనాడు
తని యింటియజమానురాలు
రు భోజనంచేస్తూ వుండగా చ
ర్లటీ గారిక్ అనే అమెరిక

...ాలిక వస్తుందని చెప్పింది. ఆపిల్లను ...హార్చి పుట్టుపూర్వోత్తరాలు ఆ ...ాటకూళ్ళమ్మ చెపుతూవుంటే ...ాజరిక్ విని ముగ్ధుడై పోయి ...ాడు.

ఆపిల్ల తండ్రి మతవిషయమైన ...ట్టుదలతో ఫ్రాన్సుదేశంవదలిన ...ారి సంతతివాడని, హ్యూజినాట్సు ...రంపరవాడని, కోపెన్ హేగన్ ...లో పుట్టి అమెరికాపోయి అమెరి...ా బాలిక నొకదానిని పెండ్లిచేసు...న్నాడని ఆదంపతులకు పుట్టినదే ...న కథానాయకురాలని చెప్పింది. ...మె చెప్పుచున్నంతసేపు అతనిభా...ము ఆ మతవీరునిపైననే లగ్న...మైనది.

ఆ చార్లెటీ పూర్వం తన ...గ్గరేవుండి పియానో నేర్చుకున్న...ని ఆమె తెలివితేటలను పొగుడు...ావుంటే మాజరిక్ నోరూరింది. ... తెలివికత్తెనూ, ఆ సౌమ్యమూ...ర్తిని కలుసుకోవాలని ఉవ్విళ్లూరి...పోయాడు.

తుదకు ఆమెవచ్చేరోజు వచ్చిం... తీసుకురావడానికి గోరింగ్ స్టేష...కు వెళ్ళింది. మాజరిక్ ఉబుకు...లోవున్న ఉత్సాహంతో ఆమె ...ప్పుడు వస్తుందా అని తదేకదీక్ష...లో తనగదిగుమ్మం జాలారువెనక ...ాచుని చూడసాగాడు.

ప్రథమదర్శనంలోనే ఆమె అం...మైన సౌష్ఠవం అతనిని ఆకర్షిం...ంది. శరీరశాస్త్రములో పండితుడు ...తడు. తరువాత ఆమె యొక్క ...ొప్ప కుటుంబమునకు చెందియున్న విషయము, మృదువైన హస్తములు, తళుక్కుమనే నగవులు అతనిని ముగ్ధునిగా చేశాయి.

ఆమెనుతప్పక పరిచయంచేసుకోవాలని తలచాడు.

ప్రథమదర్శనంలో జనించిన భావాలు దినదినాభివృద్ధి పొందాయి. అతడు చదువుచున్న విషయాల్లో ఆమెకూడా ఆశక్తురాలైవున్న సంగతి తెలుసుకొన్నాడు. ఆ యింట్లోవున్న యువజనబృందం అంతా కలసి గానసభలకి, వేదాంతవిషయాలు చర్చించే సభలకి వెళ్ళేవారు. మాజరిక్ ఏకవులను ప్రేమించాడో వారినే ఆమెకూడా గౌరవించేది. ఆమె సంగీతసాహిత్యాలలోనే ప్రవీణురాలుగాక లెక్కలు, పదార్థవిజ్ఞానశాస్త్రంలో కూడా ఆమె తెలివితేటలుగలిగి వుండేది.

ఆమెతో కలసిమెలసి తిరగడం అతనికి పరమానందంగావుండేది. ఆలాంటి ఆనందం యిదివరకు అతడు అనుభవించలేదు.

ఇంతేకాక ఆమెలోవున్న ఒక విధమైన స్వేచ్ఛ- ఆమె వ్యవహారములను ఆమె చూసుకోగల శక్తి, బాధ్యత- యితర యూరోపియన్ బాలికలలో అతను చూడలేదు.

గోరింగ్కు మాజరిక్ అంటే అమితవాత్సల్యం. కాగా వారిఅన్యోన్యతకు ఆమె అడ్డుపడలేదు. అప్పుడప్పుడు నవ్వుతో వారితోకూడా ఆమె మ్యూజియముకి, యితర ప్రశాంతస్థలాలికి వెడుతూవుండేది.

ఒకనాడు ఆయింటిలోని వారందరు లీప్జిగ్ ప్రాంతమందలి చిన్ని గ్రామానికి సరదాగా వెళ్ళినారు. ఆ గ్రామం ఎలెస్టర్ నదికి ఆవలి ఒడ్డునవున్నది. ఆనది చాలా వడి కలది. తిరిగి రావడంలో గోరింగ్, చార్లెటీ, మాజరిక్ విధివశంచేత ఒకనావలో ఎక్కారు. వడ్డు చేరేసరికి స్థూలకాయురాలైన గోరింగ్ దిగబోయి నీటిలో పడిపోయింది.

నీటివడివల్ల లోపలికి కొట్టుకుపోయింది. ఇంతలో మాజరిక్ కోటునుతీసి గట్టున పారేసి నీటిలో దూకి ఆమెను ఒడ్డునకు లాగాడు.

ఆయేనుగుగున్నను బయటపడవేసేసరికి మన మాజరిక్ ఉక్కిరిబిక్కిరి అయినాడు. జ్వరంవచ్చింది. డాక్టరు అతనిని గుండెలు ఆరేవరకు మంచం వదలవద్దని శాసించాడు.

గోరింగ్ అతనికి తగిన చాకిరీ చేయలేకపోయింది. కాని కొన్ని చెడుగులు కూడా మంచికేవస్తాయి.

చార్లెటీగారికీ అతనిమీద జాలి తెలిచింది. అతడు కాలేజీలో మంచి మంచి ఉపన్యాసాలు పోగొట్టుకున్నాడని అతనిదగ్గర కూర్చుని ఆ ఉపన్యాసాలు చదివేది. బిగ్గరగా ఆమె కొన్ని మంచిమంచి యింగ్లీషుపుస్తకాలుకూడా చదివి వినిపించేది. అప్పుడే అతడు యింగ్లీషు నేర్చుకున్నాడు.

మ్యాజరిక్ బైరన్ మహాకవిని ప్రశంసిస్తే, ఆమె షేక్సుపియర్ని ప్రశంసించేది.

అది వారి ప్రథమపరిచయం.

తరువాత వారిద్దరుకలసి ఉప

న్యాసాలకు వెడుతూవుండేవారు.

ఆమెకు ధనికురాలననే గర్వము లేకపోవడం, సత్యమునందు భక్తి వుండడం, నిరాడంబరత గలిగివుండడం, బాధపడేవారిని చూచి జాలిపడడం మొదలైన గుణములు వానిని కరిగించేవి. చెక్ జాతీయ చరిత్రఅంటే ఆమె చెవికోసుకునేది. హాప్సుబర్గుల దారుణకృత్యములకు ఆమెకూడా కంటగించుకునేది. కొద్దిరోజులలోనే వారి స్నేహలత అలుముకుపోయింది.

ఆనందమయదినములు యిట్టే వెళ్ళిపోతాయి. చార్లెటి అమెరికాకు తిరిగి ప్రయాణమైనది. వెళ్లే దారిలో గ్యేజీస్‌బర్‌న్‌లో దిగి ఆమె స్నేహితులను చూచిపో తలచుకుంది. ఆమెను పంపివచ్చాక మాజరిక్ గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. యింజనుపొగ, గార్డు విజిల్, రైలుబండి నడకా గుండె బేజారు చేశాయి. యింటికివచ్చే లోపునే గుండె నిబ్బరంచేసుకున్నాడు. ఆమెకొక లేఖ వ్రాసాడు ఆరాత్రి ఎక్స్ప్రెసులోనే. 'చార్లీ'అని సంబోధించాడు. అప్పుడు అతనిచేతిలో దమ్మిడీలేదు. యింకా విద్యార్థి. ఇంకా ఎక్కడా ప్రవేటు చెప్పుకునే ఆస్కారమైనాలేదు. అట్టివాడు ఆమెను పెండ్లిచేసుకోమని కోరినాడు.

రెండురోజులలో జాబువచ్చింది. అందులో ఆమె చేసుకుంటాను అనిగాని, చేసుకోను అనికాని వ్రాయలేదు. కాని అందులో అతనికి ఆత్మ శాంతికరమైన వచనములు కనుపించాయి.

ఆమె అమెరికావెళ్ళే లోపున ఆమెను మరివకసారి చూడాలని అతడు తలచాడు.

అతనికి రావలసిన నాలుగు డబ్బులు వడికితే ఎల్‌జర్స్‌బర్గ్ నాలుగోక్లాసులో వెళ్లడానికి సరిపోతుంది. నాలుగోక్లాసంటే పెట్టిలాంటి బండి. మనదేశంలో ఆవులను, గుర్రాలను తీసుకువెళ్ళే బండిలా వుంటుంది.

రైలుకర్చు లేకపోతే నడిచేనాపోయేవాడే. కాని ఆరోజులలో ఎండకి భయపడ్డాడు.

ఎలాగైతేం వెళ్ళాడు. ఏంమాటాడుకున్నారో! పెండ్లిచేసుకోడానికి నిశ్చయించుకున్నారు. అతడు తిరిగి లీప్‌జిగ్ చేరాడు. ఆమె అమెరికా వెళ్ళిపోయింది.

మాజరిక్ సుఖస్వప్నములతో లీప్‌జిగ్‌లో విద్య పూర్తికాగానే వియన్నా చేరాడు.

అతడు అధ్యాపకుడు కావాలంటే ఒకపుస్తకం వ్రాయాలి. కాగా అతడు తన ప్రథమపుస్తకరచనకు మొదలు పెట్టాడు.

కష్టపడి పనిచేస్తే చక్కటిఫలం అబ్బుతుంది.

•పుస్తకం పూర్తికాగానే చార్లెటినీ తీసుకువచ్చి పెండ్లిచేసుకోవాలని తలపెట్టాడు. అప్పుడు అతడు సోదరునితోసహా ఒకమిత్రుని (-సెల్‌సింగర్) ఇంట వుండేవాడు.

ఆపుస్తకం వ్రాయడం చ
కష్టమైనదే. యూరపులోని రా
లకు సంబంధించిన అంకెలు
సమకూర్చాలి అందులో.

ఒకనాడు అతని అక
చెడింది. చార్లెటీ కారునుండి
టవల్ల ప్రమాదమైన దెబ్బత
దని, ఆమెను చూడటానికి రవ
మాజరిక్‌కు ఒక కేబుల్ గ్ర
వచ్చింది. ప్రయాణానికి సర్వా
ద్ధాలుచేసాడు. కాని అతడు
లుదేరే లోపల ఆమె స్వహ
తో ఒకజాబు వ్రాసింది. పుస్త
పూర్తి అయ్యేవరకు రావద్దని, త
కులాసాగా ఉన్నాననీ తెలిపి
అతని ఆందోళన తగ్గినా ప్రయా
మానలేదు.

న్యూయార్కుకు వెళ్ళే
ఎస్. హెర్డెర్ ఓడ సాం
వద్ద ఎక్కాడు. ఆ రోజుల
అట్లాంటిక్ సముద్రం దాట
పునర్జన్మ ఎత్తడం అన్నమా
అందులోను ఫిబ్రవరిమాసం
గాలి అనుకూలంగా ఉండదు.
ఓడ ప్రతిదినం తుపానులతో
రోకవలసివచ్చేది. తుద కొకన
ప్రచండవాయువువల్ల ఒక
తొట్టి బద్దలేసి నీరు ఓడను
చేసింది. అందులోని ప్రయాణీక
ఆరోజుతో తమ జీవితములకు
చీటీ అనుకున్నారు. మాజరిక్
మిసంభవించినా సరే అని
యంగా పడుకున్నచోటనుండి
నన్నాలేదు. ఎంత ధైర్యశాలో
ఆ ప్రయాణం పదిహేడురో

గా లు ప డి చూస్తూఉండేవాడు. చారలెటి తండ్రితో సంప్రదించింది.

చివరకు విషయం తేలింది. గారిక్ వాళ్ళ యిద్దరకు రెండు ఓడ టికెట్లు కొంటానికి, వియన్నాలో సంసారం పెట్టటానికి 150 పౌనులు యియ్యడానికి ఒప్పుకున్నాడు– కూతురు పోరువల్లనే అనుకోండి.

మార్చిమాసంలో ఒకరోజు ఉదయాన్ని వారివివాహం రిజస్టరు చేసుకున్నారు. ఆరాత్రి వాళ్ళయింట్లో పెండ్లి అయింది. అది చాలా క్లుప్తంగా జరిగింది. ఒక వారం రోజులు మనుగూడుపులు కుడుస్తూ ఆనగరమందలి దృశ్యాలు చూసారు ఆ నూతనదంపతులు.

ధనికుని కూతురు కనుక ఆమె కోటీశ్వరుల గృహాలన్నీ చాలవరకు చూపించింది మాజరిక్కునకు. వారంగడిచాక తిరిగి వియన్నాకువచ్చే స్టీమరు ఎక్కారు. మొత్తంమీద మాజరిక్ 15 రోజులున్నాడు అమెరికాలో. పెళ్ళికాలమందు తనభార్య కుటుంబపుపేరును తనపేరులోపెట్టుకుని థామస్ గారిక్ మాజరిక్ అయినట్టు ప్రకటించాడు.

తిరిగి వియన్నాకువచ్చే దారిలో మాడమ్ గోరింగ్‌యొక్క దీవనలు పొందటానికి లీప్‌జిగ్‌లో దిగారు. తరువాత ప్రేగ్‌నగరంలో దిగి అక్కడ వింతలు విశేషాలు సేవించారు. వారు పునరుద్ధరింపబోయే రాజ్యానికి ఆనగరం ముఖ్యపట్టణమగునని ఆనాడు వారు తలంచలేదు. తుదకు వియన్నా చేరినారు. ఆనూతనదంపతుల సంసారజీవితం ప్రథమంలోనే దుర్భరమైంది. కాలవకావలవడ్డున లియపాల్డుస్టాండులో ఒక చిన్నగది, వంట యిల్లు అద్దెకు తీసుకున్నారు. హంగులేని వంటయిల్లు. దానిని వంటయిల్లు అనుటే ఒకగొప్ప. ఆదరిద్రగొట్టు నగరప్రాంతంలో ఒక చిన్నస్కూలులో సప్లయిఉపాధ్యాయుడుగా కుదిరాడు పొట్టపోషణకై. ఆ ఉద్యోగంలో అతనికి ఏమీ శ్రద్ధవుండేది కాదు. దానివల్ల లాభము అంతగా కనుపించలేదు. కాగా ప్రవేటు చెప్పడం ప్రారంభించాడు. దానికి తోడు అసిస్టెంటు ఉపాధ్యాయుని పదవికి సహాయంచేయు పుస్తకమును తిరిగి మొదలుపెట్టాడు. తుట్టతుద కాపుస్తకం పూర్తి చేసాడు. అదృష్టంపట్టింది. కనాకష్టం మీద యూనివర్‌సిటీవారు ఆమోదించారు. ఆపుస్తకంపేరు 'సూసైడి ఏజ్ మాస్ ఫెనోమినా'. దానికథావస్తువు అతని బాల్యంలో గుర్రపుశాలలో చూసిన ఆత్మహత్యమీద ఆధారపడినట్లు చెప్పాడు.

కునికేనక్కమీద తాటిపండులా పిట్టని కొట్టా పోయిలోపెట్టా అన్నట్టు వుంటే ఆసంసారానికితోడు అతనికి అనారోగ్యం. టైఫాయిడు జ్వరంవచ్చింది. అప్పటికి ఒక ఆడపిల్ల! దేనికన్నా లోటుగాని దానికేంలోటు. కోరిచేసుకున్నాడామె? మళ్ళీ సంవత్సరం గడిచేసరికి ఆమె రతణంకోరే పిల్లకాయ మరి ఒక పుట్టుకొచ్చాడు.

కాని భూదేవినిమించిన ఓ కల ఆయిల్లాలు, తనభర్తకు స విధములా అర్ధాంగి అయిన ఆమె యింటిపనులను తాను యంగా చక్కబెట్టుకోవడమే కుండా తీరిక చేసుకొని భ వ్రాతపనిలోను, భాషాంతరీక ములలోను భాగస్వామురాలై ఆమె స్వయంగా కొన్ని వేదా గ్రంథాలు భాషాంతరీకరించి ప్ర రించింది.

కొంపచిన్నదైనా ఆనగర దలి విజ్ఞానులకు అది కేంద్రస్థ మైంది. వేడిరక్తముగల యువక ఆభావిభాగ్యోదయనిర్మాతని సుకోగలిగారు. వానితో రాత్రి వళ్లో అంతులేని చర్చలు సాగి వారు, ఆ చిన్నకొంపలో; కొ గాదు——గది.

ఆ నగరంలో పెద్దవారం మాజరిక్‌ను ధనికకుటుంబీకురా చార్‌లెటి భర్తగా ఎరుగుదు ఆధనిక అమెరికను భార్య కొన్ని అద్భుతసంఘటనలుకు సంభవించేవి ఆపూరికొంపవద్ద.

ఒకసారి వెన్నిస్‌నుంచి బ్యా ర్ ఒకడువచ్చి వారిధనమును బాంకులో వేసుకోమని కోరినా దమ్మిడీకి మొగంవాచిన వానివ యీలాంటి లక్షాధికారివచ్చి కోరితే ఎలావుంటుందో మీరే లోచించుకోండి.

ఆకాలంలోనే అతడు భార్యప్రో
్యలంచేత కాతలిక్ మతం వదలి
ిన ఆత్మజాతీయ చెక్కు ప్రోటస్టేం
ు మతం స్వీకరించాడు.

ఆ సమయంలో కార్నోవిట్జు
ిశ్వవిద్యాలయంనుండి అతనిని ఉ
్యోగంయిస్తాం రమ్మ నమని ఆ
్వానంవచ్చింది. కాని ఆభార్యా
ర్తలు కష్టాలు అనుభవిస్తూ
ాయన్నాలోనే ఉండాలని నిశ్చ
యించుకున్నారు. కాని అక్కడకు
వెళ్ళలేదు.

శెలవులలో మాజరిక్ స్వస్థల
సగు మొరోవియా వెళ్ళినాడు. అ
్కడ జీవితం చాలా చౌకగా గడి
చేది. కాని అక్కడ మరీ విచిత్ర
మైన సంఘటనలు కలిగాయి——
ాతని ధనికభార్యవల్ల.

ఆవూరి ప్రజలు తమవూరికి రై
లు వేయించమని ఒక పిటీషను ప
ంపుకువచ్చారు.

ఒకరోజున ఒక ముసలిరైతు
వచ్చి సందేహించి తుదకు తాను
ాతని అమెరికన్ భార్యను చూట్టా
ికి వచ్చానని తేల్చాడు. చూసి
ఆమె నిజంగా అమెరికా దేశీయు
రాలేనా? నేను ఎప్పుడు అమెరికా
వాళ్ళను చూడలేదు'. అన్నాడు.

'అవును, ఆమె నిజంగా అమె
రికా దేశీయురాలే. ఇదిగో, ఆమె
ఇక్కడకే వస్తోంది నీవే చూడు'
అన్నాడు నవ్వుతో మాజరిక్. అ
ుడు ఆమె వంక చూసాడు. దవడ
లు చప్పరించాడు 'నేను ఆమె ఏ దేవ
తలాగునో వుంటుందనుకున్నా' అం
టూ తిరిగిచూడకుండా వెళ్ళిపో
యాడు.

ఆసమయంలోనే ప్రేగ్‌లో చె
క్కులచే నడిపింపబడే విశ్వవిద్యా
లయంనుండి వర్తమానం వచ్చింది.
ఆవిశ్వవిద్యాలయం పురాతనమై
నది, కాగా అందులో ఉద్యోగం
చాలా గౌరవమైనదనుకున్నాడు.
కాని అక్కడ జర్మన్ భాష ప్రధా
నంగా వుండటానికి అతడు కంట
గించుకున్నాడు. కొద్దిమంది జర్మన్
యువకుల కొరకై వేలకొలది ఉన్న
చెక్కులను, స్లావాకులను వారి
మాతృభాషను వదలి యింకోభా
షలో చదువుకోమన్నారు. అతనికి
అది సహింపరానిదిగావుంది. కాని
ఆందోళనవల్ల కొంతమంది అధ్యా
పకులు చెక్కుభాషలో మాట్లాడ
టానికి అధికారులు అనుమతించా
రు. ఆ సంవత్సరమే వియన్నాపార్ల
మెంటులో కొందరు చెక్కులు దె
బ్బలాడి ప్రేగ్‌ను వేరే విశ్వవిద్యా
లయముగా చేయించారు అక్క
చెక్కుభాషాద్వారానే విద్యగర
పునట్లు శాసించారు. యివన్నీ తర
చితరచి అక్కడ తప్పక వివాదం
వస్తుందని తెలుసుకొని ప్రేగునగ
రంలో అధ్యాపకుడైనాడు దాని
కంతకు మూలకారణం మాజరిక్
స్నేహితుడు జిమ్మర్ మేన్ అఫ్
వియన్నా అని తెలుస్తోంది. ఆ
ఉద్యోగం ఆమోదించడంలో చార
లెటితో బాగా ఆలోచించే వప్పు
కున్నాడు. అప్పటి కామె చెక్కు
భాష బాగా నేర్చుకుంది.

ఆజీతంతో సంసారం గడిచిపో
తోంది. ఆతని చదువుకి అడ్డువచ్చే
పై వేటులకు పోనక్కరలేక పో
యింది.

అందుచేత 1882 వేసంగిలో
ప్రేగ్ నగరంచేరారు——

ప్రొఫెసరు పదవికితోడు పార్ల
మెంటు మెంబరయాడు. తరువాత
కూతురుతో దేశంనుండిపారిపోయి
దేశవిముక్తికి పాటుబడ్డాడు. అతడు
దేశం వదలిపోయి హాప్సుబర్గులకు
వ్యతిరేకంగా వున్నాడని తెలిసి ఆ
మె బిడ్డలను ఖైదుచేసిరి ప్రభుత్వం
వారు—ఆమె అమెరికామనిషి—ఆమె
ను ముట్టడానికి వారి తరముకాదా
యె——కాని ఆమె ఆరోగ్యముకూ
డా చెడింది. తుదకు మహాసంగ్రా
మంలో చెక్కులు విజయవంతులై
స్వాతంత్రరాజ్యం స్థాపించుకున్నారు.
మాజరిక్ డిమాక్రాటిక్ నియంత
అయినాడు. ఆ ఆనందంలో ఆమె
కూడా భాగస్వామురాలైనది. కాని
మాజరిక్ అధికారం వహించిన
సంవత్సరములోనే ఆమె దివంగతు
రాలైనది.

ఆవీరనారీమణి తనభర్త దేశం
యొక్క స్వాతంత్ర్యంకొరకు పాటు
పడి తుదకు తనజీవితమునుకూడా అ
ర్పించింది కష్టాలు అనుభవించడా
నికేగాని సుఖం అనుభవించడానికి
ఆమెకు విధి అనుజ్ఞ యివ్వలేదు.

## ఖద్దరుదుస్తులతో గవర్నరుపీఠమెక్కిన ఆంధ్రమహాశయుడురావు

# రాఘవేంద్రరావు

'శ్రీరాఘవేంద్రరావు ఇండియామంత్రి సలహాదారుగా నియమితులు కావడం ప్రత్యేకాంధ్రరాష్ట్ర సంపాదన విషయంలో దీక్షితులు అయివున్న ఆంధ్రుల అదృష్టం.'

రచయిత :

తోలేటి గంగాధరం, ఎం.యే.

రాష్ట్రేతరప్రాంతాల్లో వలస నెలకొనివుండి విశేషవిఖ్యాతిని ఆర్జించిన ఆంధ్రమహాశయుల్లో శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారొకరు. వారిపూర్వీకులు కృష్ణా మండలానికి చెందిన కమ్మవారు, వారు మధ్యమాగాణాల్లోని నాగపురానికి వలసవెళ్ళి ధనాన్ని, యశోధనాన్ని ఆర్జించారు.

అట్టి యశోవంతమైన కుటుంబానికి అలంకారప్రాయమైన శ్రీ రాఘవేంద్రరావుగారు లండన్‌లోని ఇండియాకార్యదర్శి హూర్క్వాస్ ఆఫ్ జట్లండు సలహాసంఘంలో సభ్యులుగా నియమింపబడ్డారనే శుభవార్త భారతీయులకు ఇటీవలనే అందింది.

ఇపుడు ఆస్థానంలో దివాన్ బహదూర్ సర్ రామస్వామి మొదలియారు ఉన్నారు. వారు ఏప్రెల్ మాసంలో ఆపదవిని వీడి వైస్రాయికౌన్సిల్ మెంబరుగా ఇండియా రానున్నారు. వారిస్థానంలో శ్రీ రాఘవేంద్రరావుగారు నియోజితులు అయినారు.

రాఘవేంద్రరావుగారు ఒకప్పుడు పక్కా కాంగ్రెస్‌వాది; మధ్యమాగాణాల్లోని స్వరాజ్యపార్టీకి నాయకమణి; మధ్యమాగాణాల్లో మంత్రిత్వం నెరపినవారు; ఆరాష్ట్రంలో కొంతకాలం యాక్టింగ్ గవర్నరుగా కూడ పనిచేసినవారు.

హైందవరాజకీయాల్లో తటస్థపడే పలురకముల అవస్థాభేదాల్ని శ్రీరాఘవేంద్రరావుగారు రుచిచూచి వున్నారు. కావుననే వారు రాజకీయాల్లో అనుభవజ్ఞులు కాగలిగారు. రాజకీయంగా హిందూదేశం విషమస్థితిలో వున్న ఈదినాల్లో రావుగారివంటి రాజ్యాంగవేత్త ఇండియామంత్రి సలహాసంఘ సభ్యుడిగా నియమితుడు కావడము ఎంతేనా సముచితంగా వుంది.

ఐరోపామహాసంగ్రామానంతర కాలంలో శ్రీరావుగారు తమరాజకీయజీవితాన్ని తీవ్రకాంగ్రెస్‌వాదిగా, గొప్ప ఆందోళనాపరుడుగా ప్రారంభించారు. ఇప్పుడు ఆయన తీవ్రమైనకాంగ్రెస్‌వాది కాదు సక్రమంగా రాజకార్యం నిర్వహిం చాలనే మితవాది.

అంతమాత్రంచేత ఆయన పూర్తిగా కాంగ్రెస్‌తత్వాన్ని కాలితో తన్ని వేశారనడానికి వీలులేదు గాంధిమహాత్ముని ఉపదేశాల్లో వ ...టప్రాయమైన, మహత్తరమై నిరాడంబరతకు ఆయన రాసి. ఆ క్టింగుగవర్నరుగాకూడ ఆయ గాంధిటోపి ధరించివున్నారు. ఇప్ప టికి కూడ ఎల్ల వేళల ఆయన ధవ దవళములయిన కద్దరుదుస్తుల ధరించివుంటారు.

ప్రారంభంలో శ్రీరావుగా విద్యాభ్యాసం బిలాస్‌పూర్‌లో అనంతరం రావుగారు ఇంగ్లండుక వెళ్ళి న్యాయశాస్త్రాన్ని అభ్యసిం చారు. భారతదేశానికి తిరిగివచ్చి ఆయన పలువత్సరాలు బిలాస్ పూర్‌లో బారిస్టరుగా ప్రాక్టీస చేశారు.

అచిర కాలంలోనే ఆయనకాల మూ, శక్తీ అంతా రాజకీయోద్య మాలకొరకే వినియోగింపబడడ పరిపాటి అయింది. మధ్యమాగాణాల కాంగ్రెస్‌కమిటీకి అధ్యక్షులుగా వరింపబడ్డారు. 1924-వ సం

త్సరంనుంచి మధ్యమాంగాణాల శాసనసభకు సభ్యులుగా ఎన్నుకొంటూ వచ్చుచునే వున్నారు.

కాంగ్రెస్‌లో సనాతనపక్షాన్నుండి చీలిపోయిన పిమ్మట శ్రీరావుగారు మధ్యమాంగాణాల్లోని స్వరాజ్యపార్టీకి నాయకమణిగా వుండిరి. స్వరాజ్యపార్టీ రాష్ట్రనాయకులుగా వారు ఆరాష్ట్రంలో రెండుతడవలు మంత్రులుగా వుండిరి. 1930–వ సంవత్సరంలో వారు ఆ రాష్ట్రపు హోంమెంబరుగా నియమితులు అయ్యారు.

1936–వ సంవత్సరంలో శ్రీ రావుగారు మధ్యమాంగాణములకు యాక్టింగు గవర్నరుగా నియమితులయిరి.

భారతీయుడు గవర్నరు కావడమే ఒక బ్రహ్మాండవిషయం. అందులో ఆసందర్భంలో శ్రీరావుగారు ముతకఖద్దరుబట్టలు కట్టుకొని గవర్నరుపీఠాన్ని అధిష్ఠించి పత్రికల ప్రశంసలకు ప్రబలంగా గురి అయ్యారు.

మందహాసాంచితమైన ముఖంగల ఆప్రతిభాశాలి చిత్రపటం ఆ రోజుల్లో ప్రచారప్రాభవాలుగల పత్రికల అన్నిటికీ ముఖమండనం అయింది. ఆయన ఉదారహృదయానికి, ప్రియవాదితనానికి సాక్షీభూతములైన చేతలు ఎన్నో ఆనాడు పత్రికల ప్రశంసలకుఅందాయి.

1935–వ సంవత్సరపు ఇండియాయాక్టు ప్రకారం 1937–వ వత్సరపు ప్రథమభాగంలో జరిగిన ఎన్నికల్లో శ్రీ రాఘవేంద్రరావుగారు మధ్యమాంగాణాల శాసనసభకు సభ్యులుగా ఎన్నుకోబడిరి. ఆసంవత్సరం ఏప్రిల్ మాసంనుండి జూలై మాసంవరకు వారు ఆరాష్ట్రానికి నడుమంత్రపు ప్రధానమంత్రిగా పనిచేసిరి. జూలై మాసంలో కాంగ్రెస్ పార్టీ వారు మంత్రిత్వాన్ని స్వీకరించడంతో శ్రీవారు తమ పదవిని విడిచిపెట్టిరి.

ఆ ఆంధ్రమహాశయులు ఇప్పుడు ఇండియామంత్రి సలహాదారుగా నియమితులుకావడం ఆంధ్రుల అదృష్టం. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణవిషయంలో మద్రాస్ ప్రభుత్వం ఆంధ్రులవాంఛలను ఇండియామంత్రికి తెలిపివుంది. ఆసందర్భమైన కాగితాలు ఇపుడు ఇండియామంత్రి ఫైల్సులో వున్నాయి. ఆంధ్ర తత్త్వవేత్త సర్ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు లండన్‌లో ఈ సంబంధమైన రాయబారపు కార్యకలాపంలో నిమగ్నులై వున్నారు. ఈపరిస్థితుల్లో ఆంధ్రమహాశయులు ఒకరు ఇండియామంత్రి అంతరంగికవర్గంలో స్థానం పొందడం ఆంధ్రజాతకానికి ఉచ్చదశయే.

ఈఉచ్చదశకు పాలకకర్త శ్రీఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు. ఆంధ్రరాష్ట్రసంపాదనసాధనలో శ్రీ రావుగారు ఈతుదిరంగంలో మాటదక్కించుకొని శాశ్వతంగా ఆంధ్రమహాప్రజాసంఘ హృదయానికి అధిష్ఠానదేవతలు అవుతారుగాక అని కోరుతున్నాను.

## నిశ్శబ్దవాయువిమానంతోదాడి నారాయణాస్త్రంవలె తిరుగులేనిది.

# చప్పుడులేని విమానం

'ఎలకమీద పిల్లిపడినట్లు మనకు తెలియకుండా మనమీదపడే యుద్ధవిమానాలు ఇకమీద కలలో వార్తలుగావు. జర్మన్ దేశీయులు నూటికి డెబ్భయిపాళ్లు చప్పుడు తగ్గిన విమానాలను తయారు చేసివున్నారు.'

గాలివిమానం! ఇప్పుడు ఆశబ్దం చెవిని పడడంతోటే గాలివిమానం యొక్క స్వరూపం మనఃఫలకం మీద ముద్రితం కాకపూర్వమే ఆవిమానం ఆకాశంమీద ఎగురుతూవుంటే అయ్యే శబ్దం మనమనఃక్షేత్రంలో గింగురుమంటుంది.

ఆకాశం మనకళ్ళకు అందకుండా మనం ఇంట్లో కూచున్నా ఆకాశంమీద గాలివిమానం ఎగురుతూవుందని అయ్యేశబ్దాన్నిబట్టి మనం ఇపుడు సులభంగా పోల్చిపట్టవచ్చు.

ఇపుడు వాయువిమానాలు విరివిగా బాంబులు వేయడంకోసం యుద్ధావసరాల్లో ఉపయోగింపబడుతున్నాయి. అయితే బాంబులు వేయడానికి ఒక్కటిగాని పదిగాని అంతకు ఎక్కువగాని విమానాలు వస్తే ఇపుడు వానిరాక వానిశబ్దాన్నిబట్టి సులభంగా ముందు పోల్చికి అందుతున్నాయి. శత్రుపక్షంవారు వానిరాకను గుర్తింపగలుగుతున్నారు. గుర్తించి తగుమైన జాగ్రత్తలో వుంటున్నారు.

శత్రువులకు ఏమాత్రం తెలియకుండా ఎలకని కట్టడానికి సడిచప్పుడు లేకుండా పిల్లి వెళ్ళినట్లు విమానాలు నిశ్శబ్దంగా వెళ్లాలి. బాంబులు రాల్చి చేయగల భీభత్సం అంతా చేసేవరకు విమానాలు వచ్చినట్లు కాని, బాంబులు రాల్చినట్లు కాని తెలియకండా వుండాలి.

అట్టి నిశ్శబ్దపు విమానాలకోసం ప్రపంచమందలి అన్నిదేశాల యుద్ధనిపుణులూ వత్సరాలుగా తపస్సుధారపోస్తూ వున్నారు. ఎప్పటికైనా అట్టి విమానాలు తయారు అవుతాయి అనే ఆశతోనే వారు వున్నారు.

అట్టి విమానం తయారు అయిననాడు ఎక్కడనుంచి అయినా, ఎప్పుడు అయినా విమానం ఏమాత్రం శబ్దం లేకుండా రావచ్చు; మనకు తెలియకండా మనపట్టణాల మీద బాంబులు రాల్చవచ్చు. బాంబులు చేయగల భీభత్సం పూర్తి అయ్యేవరకు ఏమిజరిగిందో మనకు అవగతంకాని సంఘటన అప్పుడు మనకు కలుగుతుంది.

అట్టి విమానపుదాడినుండి మనం మనల్ని రక్షించుకోడానికి ఏమైనా, వరిముల్లు వాసేనా, ఆస్కారం వుండునా? వుండదు. ముమ్మాటికి వుండదు.

ఎగిరేటప్పుడు ఎట్టి శబ్దంకాని చేయని వాయువిమానం ఇట్లు యుద్ధవిషయంలోనే కాదు ఘామూలు విషయాల్లోనూ—అనగా ప్రయాణీకుల్ని, సరుకుని మోసుకువెళ్లే విషయాల్లోనూ—కావలసిందే; కోరతగిందే.

ఏమంటే, ఇపుడు గాలివిమానాలు ఎగిరేటప్పుడు చేసే పెద్ద చప్పుడు వానివిషయంలో ఒక దుర్గుణంగావుంది.

కాగా నిశ్శబ్దపు వాయువిమానాన్ని తయారుచేయడానికిగాను పరిశోధనలు సాగించేనిమిత్తం వేలకొలది పౌనుల ధనం వ్యయం చేయబడుతూవుంది. విమానాలు ఎగిరేటప్పుడు చేసే దిక్కులు పిక్కటిల్లే శబ్దం విమానంలోపల కాబిన్‌లో వుండే ప్రయాణికులకు వినిపించకుండా శబ్దసంహారకయంత్రాలు ఏర్పచడానికిగాను ఇప్పుడు ప్రతి విమానంకొరకున్నూ విశేషంగా ధనం వ్యయం చేయబడుతూవుంది.

నిశ్శబ్దపు వాయువిమానాలు కనుగోబడితే ఈవ్యయం తప్పు

తుంది. కాని అనిశ్శబ్దపు వాయువిమానాలు వచ్చినతరవాత జరిగే యుద్ధంయొక్క తీరు తలుచుకుంటే మనం ఇప్పుడే కొయ్యపెరుమాళ్ళము అయిపోతాము.

యుద్ధసంబంధమైన ఆయుధాల్ని స్థూలదృష్టితో చూసినా, సూక్ష్మదృష్టితో చూసినా రెండువిధాలుగా విభజింపవచ్చు. ఒకటి! సంహారకఆయుధాలు.——రెండు: రక్షకఆయుధాలు. ప్రతి సంహారకఆయుధానికిన్నీ జవాబు చెప్పగల రక్షకఆయుధంవుంది.

నిశ్శబ్దపు వాయువిమానం సంహారకఆయుధాలవర్గంలో తలమానికం. ఈసంహారకఆయుధానికి రక్షకఆయుధం లేదు. నిశ్శబ్దవాయువిమానపుదాడి నారాయణాస్త్రప్రయోగం వంటిది. దానిప్రయోగానికి తిరుగులేదు. దానిపాల బడ్డవాడికి కపాలమోక్షమే కాని అన్యథా శరణం నాస్తి.

ఒకసారి ఊహాప్రపంచంలో విహరిద్దాము. మనకు ముఖ్యమైన ఒకపట్టణంమీదికి అట్టి నిశ్శబ్దపు వాయువిమానం-ఒకటిగాని కొన్నిగాని——పిల్లివలె వస్తాయి అనుకోండి.

వానిరాక మనకు ఏమాత్రం తెలియదు. వారిరాక ఏమాత్రం తెలియకపోతే వానినుండి రక్షించుకోడానికి ఆస్కారం ఏది? విమానాలదాడినుండి రక్షితులం కావడానికి తీసుకోతగ్గ ప్రథమరక్షణలన్నీ దాడివెడలివచ్చిన విమానాల నాదం విన్నపిమ్మట తీసుకోతగినవే. కాగా మనరక్షకులు అనాదాన్ని వినలేక పోతే రక్షణవిషయంలో వారు అప్రమత్తులై ఎట్లా వుండగలరు?

ఈనిశ్శబ్దపు విమానాలు పగలే దాడి వస్తాయి అనుకుందాము. అప్పుడు మనరక్షకులు వానిని కళ్లతో చూడవచ్చు. కాని ఆవిమానాలు నిశ్శబ్దవిమానాలైనందువల్ల వాటిరేంజి మనవారికి తెలియదు.

ఒకవేళ ఈనిశ్శబ్దపు విమానాల దాడి రాత్రి జరిగితే? విమానాల శబ్దాన్ని పట్టి వాటి ఉనికిని అవి పోయే దిక్కును తెలపడానికి నిర్మితాలయిన యంత్రాలు నిరుపయోగాలు అవుతాయి. అవి నిరుపయోగాలు కావడంతో సెర్చిలైట్లను కూడా అనిశ్శబ్దపు విమానాలు తప్పించుకో వచ్చు. సెర్చిలైట్ల విలువ నిప్పచ్చరం అయినప్పుడు రక్షణకు నిర్దిష్టాలైవుండే విమానాలు దాడివచ్చిన విమానాల్ని ఏమీ చేయలేక పోతాయి. దాడి వచ్చిన రాత్రి చీకటిరాత్రి అయినా; ఆరాత్రి మబ్బుపట్టివున్నా నిశ్శబ్దపు విమానాలు నిర్నిరోధంగా, నిరాఘాటంగా తాము వచ్చిన దారుణకృత్యాన్ని —— అశ్వత్థామ నిద్రాసక్తులైన ఉపపాండవుల్ని చంపివేసినట్లు—— సాగించవచ్చు.

ఈరీతి దారుణపుదాడికి ప్రతియేమీ లేదా అనే ప్రశ్న కలగడం సహజం. ఉన్న ప్రతి అల్లా ఒక్కటే. మన శత్రువులు తమ నిశ్శబ్దపు విమానాలతో మనపట్టణాలమీద పడి దాడి సలుపుతూ వుంటే మనం మననిశ్శబ్దపు విమానాలను తీసుకొని వెళ్లి మనశత్రువుల పట్టణాల మీద దాడిసల్పడం—— ఇదే ప్రతి.

అయితే ఇంతకీ అట్టి నిశ్శబ్దపు విమానాలు సృష్టింపబడడం సాధ్యమా? అనే సందేహం చాలామందికి కలగవచ్చు.

పలువత్సరాలుగా మనం నిశ్శబ్దపు వాయువిమానాల్ని గురించి వింటూవున్నాము. గత ఐరోపామహాసంగ్రామపు కడకాలంలో అనగా 1917, 1918 సంవత్సరాలలో పశ్చిమప్రాంతాల యుద్ధంలో నిశ్శబ్దపు వాయువిమానానాలు ఉపయోగింపబడుతున్నాయి అని పుకారుషుడు పలికివున్నాడు.

అప్పటినుంచీ నిశ్శబ్దపు విమానాల కథ బృహత్కథగా మారుతూనే వుంది. కొద్దికాలానికిపూర్వం విచిత్రమైన నిశ్శబ్దపు విమానం ఒకటి నార్వే, స్వీడన్ దేశాల మీదుగా ఎగురుతూవుందనే వార్త ఐరోపాఖండమంతటాఅల్లుకొన్నది.

యూరప్‌ఖండంలో జర్మనీకీ ఫ్రాన్సుకి సరిహద్దున ఫ్రెంచివారు 'మాజినాట్‌లైన్' అనే దుర్భేద్యమైన నిర్మాణాన్ని ఏర్పరచివున్నారు. ఆమాజినాట్‌లైన్‌మీద పలుసారులు నిశ్శబ్దపు విమానంఒకటి ఎగురుతూవచ్చిందని ఫ్రెంచిప్రభుత్వంవారు ప్రకటిస్తూ వచ్చారు.

అయితే ఈనిశ్శబ్దపు విమానాలు ఎక్కడివి? ఫ్రెంచివారికి

జర్మన్‌లు ప్రబలశత్రువులు—నార్వే, స్వీడన్ దేశాలమీద జర్మనీకి ఆశాదృష్టులువున్నాయి. కాగా నార్వే, స్వీడన్ దేశాలమీద లోగడ ఎగురుతూవచ్చిన నిశ్శబ్దపు గాలివిమానమూ, ఫ్రెంచివారు నిర్మించిన మాజినాట్‌లైన్‌మీద అప్పటప్పటికి ఎగురుతూ వచ్చిన నిశ్శబ్దపు విమానమూ జర్మనీవారివే అయివుండాలని అందరూ అనుమానపడ్డారు.

ఒట్టి అనుమానంతోటే ఇంకా వుండడం దేనికి? 1932 నాటికే జర్మన్‌లు తమవిమానాలు ఎగిరేటప్పుడు పెద్దచప్పుడు చేయకుండా కొద్దిచప్పుడుమాత్రం చేసేపద్ధతిని కనుగొగలిగారు. ఆపద్ధతిప్రకారం వారు నూటికి డెబ్బయిఅయిదుపాళ్లు అనగా నాలుగింటిలో మూడుపాళ్లు తమవాయువిమానాల నాదాన్ని తగ్గించగలిగారు.

దరిమిలాను అనగా ఈఏడు ఏళ్లల్లోనూ మిగతా ఒకపాలు నాదాన్నికూడా వారు లేకుండా చేయగలిగివుండినట్లు అయితే ప్రపంచంలోని ఇతరదేశాల శాస్త్రజ్ఞులకు తెలియని శాస్త్రరహస్యం ఏదో జర్మన్‌శాస్త్రజ్ఞులకు తెలిసింది అని అనుకోవాలి.

చికాగో మహానగరాన్నుండి ప్రచురితమయ్యే 'పాప్యులర్ ఏవిఏషన్' (Popular Aviation) అనే పత్రికలో ఎ. వైట్‌హాస్ అనే పండితుడు ఈవిషయంలో తన అమెరికా చూపిన అభివృద్ధిని గురించి ఇట్లా చెప్పుతున్నాడు:

"నిశ్శబ్దవాయువిమాననిర్మాణం కోసం అమెరికాసంయుక్తరాష్ట్రాల్లో పలువత్సరాలుగా పరిశోధనలు సాగుతున్నాయి. కొంతకాలానికి క్రితం ఇక్కడ 'కాంకరర్' అనేవిమానం తయారుచేయబడ్డది. ఆవిమానం ఎనిమిదివేల అడుగుల ఎత్తున ఎగురుతూవుండగా క్రింది వారికి దానిసడి వినరాలేదు. ఆ పిమ్మట మరొకరకపు విమానం తయారుచేశారు. ఆవిమానం నిశ్శబ్దంగా వుండడమేకాదు ఎగరడం ప్రారంభించిన మరుక్షణంనుంచీ అది కనిపించకుండా వుండేంది. ఎగురుతూవుంటే శబ్దం వినిపించకుండా వుండడమేకాదు, అసలు విమానమే కనిపించదు. ఇట్టి కనిపించని, వినిపించని విమానాలు తయారై అవి యుద్ధకార్యాలకొరకు విరివిగా వినియోగింపబడ్డాయి అంటే ఈభూమిమీద మానవుడికొంప మరుక్షణంలో గుండం అయిపోయిందన్నమాటే. మానవజాతికి మారకదశ ప్రారంభమైందన్నమాటే."

ఇక ఈవిషయంలో గ్రేట్‌బ్రిటన్ ఎట్టి స్థితిలో వున్నదో కొంత విచారిద్దాము.

గాలివిమానాల్లోని మోటారు యంత్రాలను నిశ్శబ్దాలుగా చేయడానికి గ్రేట్‌బ్రిటన్‌లో చిరకాలం
గా పరిశోధనలు నడుస్తున్నా
1918 నాటికే విమానాల మో
రును నిశ్శంగా చేసే యంత్రం క
గొబడింది. కాని ఆయంత్రం మి
బరువైనదిగా వుండడంచేత
వాయువిమానాలకు అక్క
రానిది అయింది.

నిశ్శబ్దవాయువిమాన నిర్మా
ననుసన్యను జర్మనీ, గ్రేట్‌బ్రి
దేశాలలో ఏదేశం పరిష్కరిం
దో మనం ఇప్పుడే చెప్పలేము.

కాని మనం ఒకసంగతిమా
నిక్కచ్చిగా చెప్పవచ్చు. ఏ
మైతే నిశ్శబ్దవాయువిమాననిర్మా
విషయంలో పైచేయిగా వుం
ఆదేశం విమానబలవిషయంలో
గిలిన అన్నిదేశాలకంటె పదివ
త్సరాల పురోగమనంలో వుండ
నిశ్చయం.

మామూలు విమానాలు ఎ
పెద్దవిగా వున్నా, ఎంతకాలం
పనిచేస్తూ వున్నా, ఎంత చురుకు
పోయేవి అయినా— నిశ్శబ్దవా
విమానాలు లేనిదేశం అవి వు
దేశానికి లొంగవలసిందే.

యుద్ధంలో ప్రధానసూత్రం
మిటి? 'నీవు చూడలేనిదానిని
కొట్టలేవు' అనే కదా! రా
పొత్తిపట్టరాని విమానాలకు వ
ఎట్లా ఎదురొడ్డగలం?

ఇంతకీ నిశ్శబ్దవాయువిమాన
ఇప్పుడు ఏదేశంలో తయారవు
న్నాయి?

## మొన్న మొన్నటివరకు భగవద్గీతనుపఠింపని మహాత్మగాంధిఅనుచరుడు

# సర్దార్ పటేల్

పెళ్లాం చావువార్తకు చలింపని నిర్వికారుడు.

కాంగ్రెస్‌లోని గాంధిపక్షీయులకు నాయకమణి.

రాబిన్‌హుడ్ పద్ధతులకు పేరుమోసిన కెయిరోమండలం అతని జన్మమండలం.

సర్దార్ వల్లభాయి పటేల్! మహాత్ముని తరవాత మహాత్ముని అంతవాడు సర్దార్ పటేల్ హైందవ రాజకీయాల్లో. ఇల్లా అనడంచేత అతడు ప్రజామోదం పొందివుండటంలో—బుద్ధి విశేషంలో—విశాల దృష్టిలో మహాత్మునితరువాత మహాత్ముని అంతవాడని అనుకోకూడదు.

ప్రజామోదాన్ని పొందగివుండటంలో అతను జవహరులాల్ ముందర దిగదుడుపు. బుద్ధి విశేషంలో రాజగోపాలాచారిని పేర్కొన్న పోటితో అతణ్ని పేర్కొడానికైనా వీలులేదు. ఇక విశాలదృష్టి!—అట్టిది ఒకటివున్నదని అతనికే తెలియదు. కాని నిర్మాణకార్యక్రమంలో అతడు అందెవేసినచెయ్యి. అతడు స్వహస్తాలతో రాజకీయ యంత్రాన్ని ఒకదానిని నిర్మించాడు. ఆయంత్రం అతని రాజకీయప్రత్యర్థుల్ని అణచివేయడమేకాదు రెండుమూడు సారులు బ్రిటిష్ గవర్నమెంటునుకూడా దద్దరిల్ల చేసింది.

మొన్నమొన్నటిదాకా పార్లమెంటరీకమిటీకి అధ్యక్షుడుగా అతడు బ్రిటిష్ ఇండియాలోని ఎనిమిది రాష్ట్రాలప్రధానులకు హుజూరు ఆఫీసరై వున్నాడు. కాంగ్రెస్ మంత్రులు, కాంగ్రెస్‌నాయకులుకూడ అతనిపట్ల భయంతోకూడిన గౌరవంతో వుండేవారు.

అరవై ఒక్కసంవత్సరాల జీవితం నిరంతరపరిశ్రమ— సంతతదేశసేవ. తరుణాల్లో తగుమైన నిర్ణయాలు కావించి అతడు వానికి అంటిపెట్టుకునివుండేవాడు. అట్టి నిర్ణయాల్లో మహాత్మునితో చేతులు కలపడానికి నిశ్చయించుకోవడం ఒకటి.

అవి మహాత్ముడు దక్షిణఆఫ్రికా నుండి తిరిగివచ్చినరోజులు. అప్పుడు మహాత్ముడు అహమ్మదాబాదును తన కార్యస్థానంగా చేసుకొన్నాడు. అహమ్మదాబాదులో వల్లభాయి పటేలు ఆరోజుల్లో బారిస్టర్. అహమ్మదాబాదులో న్యాయవాదులంతా తరుచుకలుసుకునేక్లబ్బు ఒకటి వుండేది. ఆక్లబ్బులో న్యాయవాదులంతా ఆదినాల్లో మహాత్ముణ్ణిగురించి పరిహాసవిజల్పితాలయిన పలుకులు అనుకునేవారు. సత్య, అహింసలు ఆయుధాలుగా చురుకులేని, మందకొడిగావుండే ఎక్సు బారిష్టరు గాంధి రవి అస్తమింపని విశాలవిశేష బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించడం ఆ అహమ్మదాబాదు న్యాయవాదులకును పరిహాసకృత్యంగా కనిపించింది.

వల్లభాయి గాంధినిగూర్చి పరిహాసానికేనా తలపెట్టేవాడు. కాదు అతనికి గాంధిస్మరంతే పట్టేదికాదు. గాంధి ఊసు ఏమీ ఎత్తక ఆదినాల్లో పటేల్ క్లబ్బులో ఒకమూల కుర్చుని పేకఆట ఆడుకునేవాడు. నడుమనడుమ అపహాస్యముద్రగల మొలకనవ్వు అతని పెదవులమీద పరిస్ఫుటమయ్యేది.

అట్టి వల్లభాయ్ పటేల్ మహాత్మునితో చేతులుకలపడానికి తీర్మానించుకొన్నాడు. ఈతీర్మానం అతని ఆంతరంగికమిత్రుల్నే సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. విద్యార్థిగా పటేల్ అల్లరి పిల్లకాయ. కార్యనిర్ణయశక్తివల్లనే నేడు అతడింతటివాడయ్యాడు.

విద్యార్థిగా అతడు అతని ఉపాధ్యాయులకు విసుగు, తలనొప్పి పుట్టించేవాడు. ఆ అల్లరి గచ్చకాయను ఏ ఉపాధ్యాయుడు అణచలేక

పోయేవాడు. అందుచేత అతను తరుచు స్కూళ్లుమారవలసి వస్తూ వుండేది. ఎల్లాగో ఆ ఆంగ్రెబ్బవిద్యార్థి చదువు ముగించాడు. న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించాడు.

క్రిమినల్ కేసుల్లో అతడు పెట్టింది పేరు. సివిల్ లాయొక్క తికమకలు అతనికి అంతగా పట్టలేదు. బందిపోటు కేసులు, దొంగతనపు కేసులు, హత్యల కేసులు వాదించడంలో అతనిబుద్ధి వాడిగావుండేది. అచిరకాలంలోనే అతనిపేరు న్యాయాధికారులకుకూడా గుండెదడపుట్టించేదిగా తయారైంది. ప్రత్యేకం అతన్ని తప్పించుకోవడానికిగాను రెసిడెంటు మేస్ట్రీటుకోర్టును బోర్సద్ నగరమునుండి ఆనంద్ నగరానికి మార్చారు. వల్లభాయి కోర్టుతో బాటు తానుకూడ ఆనంద్‌కు వెళ్లాడు. అప్పుడు అధికారులు ఇక చేసేది లేక కోర్టును తిరిగి బోర్సద్‌కు మార్చారు.

అతనికి బారిష్టరు కావాలని ముచ్చటగా వుండేది. కావలసినపైకం చేతిలోకి రావడంతోటే అతడు సీమకుబయలుదేరాడు. ఇంగ్లండులోమాత్రం అతగాడు అతిదీక్షతో చదువుసాగించాడు. పాఠశాలలో అతని తెలివితేటలు అంత రాణించలేదు. కాని పరీక్షలో అతనికి ఫస్టుక్లాసు వచ్చింది. బార్ పరీక్షలో జయంగాంచిన విద్యార్థులకు ఆయేడు అతడు అగ్రసరుడు అయాడు. అతనిపట్టుదల, పరిశ్రమ నేటిలాగే నాడున్నూ అతిఅవసరమైన విషయాని కే మీదుకట్టబడివున్నాయి.

పరీక్షఅయిపోయిన మరుక్షణంలో అతడు ఇండియాకు మరలినాడు. యూరప్‌లో ఇతర దేశాలు చూడాలనే కుతూహలం అతనికి కలగనేలేదు. అనుకున్నపని నెరవేరింది. నేరుగా ఇంటికి వచ్చాడు చిత్తాన్ని చెదరనియ్యలేదు.

అయితే ఇంతకీ గాంధివర్గంలో పటేల్ ఎట్లాచేరాడు? గాంధితత్వానికి మోహితుడు అయా? కాదు. గాంధియొక్క అపరూపపు వ్యక్తిత్వం అతన్ని ఆకర్షించింది. తోడనే అతడు గాంధిమహాత్మునకు ముఖ్యానుచరుడయ్యాడు. బార్డోలిలో పన్నుల నిరాకరణోద్యమాన్ని అతిప్రశంసనీయంగా నిర్వహించాడు. బ్రహ్మాండాంతసంవర్థిఅయిన బ్రిటిష్ గవర్నమెంటు ప్రయోగించగలిగినంత తీవ్రంగా నిర్బంధాస్త్రాన్ని బార్డోలీమీద ప్రయోగించింది. అయినా పటేల్ నాయకత్వంక్రింద బార్డోలి జయించింది. బార్డోలిజయంతో పటేల్ ప్రఖ్యాతి మిన్నుముట్టింది.

1930లో సత్యాగ్రహోద్యమాన్ని గుజరాతులో అత్యంతజయప్రదంగా నిర్వహించి ప్రభుత్వంవారి గుండెల్లో దడపుట్టించాడు ఈనిర్మాణకార్యనిపుణుడు. అందుకు కృతజ్ఞతాపూర్వకముగా హైందవులు తాము ఈయగల అత్యధికగౌరవదానాన్ని కాంగ్రెస్ అధ్యక్షతను అతనికి ఇచ్చారు. 1932-వ సంవత్సరంలోసత్యాగ్రహోద్యమంతిరిగి ప్రారంభింపబడినప్పుడు పటేల్ మహాత్మునితోబాటు 1818-వ సంవత్సరపు మూడవరెగ్యులేషన్ ప్రకారం నిర్బంధింపబడి ఇంచుమించు రెండు సంవత్సరాలు విచారణలేని శిక్షను అనుభవించాడు.

పటేల్ గాంధిమహాత్ముని అనుచరుడే అగుగాక! అనేకవిషయాల్లో పటేల్‌కి మహాత్మునికి తేడాలు వున్నాయి. మహాత్మునిలాగ పటేలు కూడ వ్యసనవివర్జితుడే. అయినా మతం విషయంలో మహాత్మునికి వున్నపట్టుదల పటేల్‌కు లేదు. మహాత్ముడు తనజీవితాన్ని అంతా భగవద్గీతమీద ఆధారపడినడుపుకుంటాడు. ఇటీవలివరకు పటేల్ భగవద్గీతను చదివేవుండలేదని చెప్పవచ్చు. సత్య, అహింసలతో మహాత్ముడు పరీక్షలు సాగిస్తూవుంటే పటేల్ భౌతిక విషయాలమీద దృష్టిని లగ్నంచేస్తాడు.

నిర్మాణవిషయంలో పటేల్ నిధి. అందరూ తనకు విధేయులయివుండాలని పటేల్ కోరతాడు. ఇతరుల స్వతంత్రాభిప్రాయాలకు అతడు సంతోషించలేదు. తాను అవునన్న దానిని ఎవరేనా కాదంటే ఓర్చలేడు. తనతో వుండదలచుకున్నవాడు తనతో లీనమేనా కావాలి, లేదా తాను చెప్పినట్లు వినసేనా వినాలి. ఈరెంటికి భిన్నంగా వుండే

వాడిని అతడు నిర్దాక్షిణ్యంగా బయటికి పంపేస్తాడు. ఆపంపివేయడంలో దురుసుతనంవున్నా గుడుసుతనానికి లోపంరానీయడు.

నిరాడంబరుడేకాని అతిపెడసరం మనిషి. వ్యక్తిగతంగా అతనికి ధనంఅంటే ప్రలోభంలేదు. కాని ధనం శక్తిసంపన్నమైందని అతనికి బాగా తెలుసు. ధనస్వామ్యములంటే అతనికి ఏమీ భ్రాంతులు లేవు. కాని వారు కాంగ్రెస్‌కి బయటవుండడంకంటె కాంగ్రెస్‌లో వుండడమే మంచిదంటాడు, అతను. రాజకీయవిషయాల్లో వల్లభాయ్ పటేల్ గాంధినోట్టిమీద నడుస్తాడు. మహాత్ముడు శాసనసభల్ని బహిష్కరించాలన్నప్పుడు వల్లభాయి ఆవాదాన్ని అందుకుని దాసుతో, మోతీలాల్ నెహ్రూతో, తన సోదరుడైన విఠల్‌బాయి పటేల్‌తో ఎదురొడ్డి నిలిచాడు. మహాత్ముడు శాసనసభాప్రవేశానికి ఒప్పుకోవడంతోటే పటేల్ పార్లమెంటరీకార్యానికి కడంగి దానిని జయప్రదంగా నిర్వహించాడు.

గుజరాతుదేశంలోని ఒకకుగ్రామంలోపుట్టిన పటేల్ ఇప్పుడు కీర్తిశిఖరంమీద వున్నాడు. అతనికుటుంబచరిత్ర ఒకసారి పరికిస్తే అతనిగుణాలు మనకు చాలవరకు అర్థమౌతాయి. గుజరాతుదేశంలో పటేల్ జన్మమండలమైన కెయిరో రాబిన్ హుడ్ పద్ధతులకు ప్రసిద్ధమైంది. ఆ పద్ధతికి పటేల్‌తండ్రి చక్కని ప్రతినిధి అని చెప్పవచ్చు.

1857 లో ప్రథమభారతస్వాతంత్ర్యసమరం జరిగినప్పుడు పటేల్ తండ్రి అందులో పాల్గొనడానికి గుజరాత్ నుండి దూరాభారాన్నివున్న ఉత్తరానికి బ్రిటీష్‌ప్రభుత్వంతో తలపడ్డానికి వెళ్లాడు. పటేల్‌తండ్రి స్వాతంత్ర్యపిపాస అట్టిది.

పటేల్‌తండ్రినిగురించి చమత్కారమైనకథ ఒకటివుంది. ఒకసారి ఒక స్వదేశసంస్థానంలో అతడుఅరస్టుచేయబడ్డాడు. ఉద్యోగులు అప్పుడు అతణ్ణి సంస్థానాధీశ్వరుని సముఖానికి తీసుకువెళ్లారు. ఆ సమయంలో ఆసంస్థానాధీశ్వరుడు చదరంగం ఆడుతూవున్నాడు. ఎత్తు తోచక కొట్టుమిట్టుఆడుతూవున్నాడు. నిర్బంధంలో ఎదట నిలిచివున్న పటేల్ ఎత్తుఒకటి సూచించాడు. అది గొప్పఎత్తు అయింది. సంస్థానాధీశ్వరుడు చాలాసంతోషించాడు. ఆసంతోషం ఫలంగా పటేల్ విడుదల పొందాడు. అట్టితండ్రికికొడుకు మన పటేల్. తండ్రియొక్క ధైర్యగరిమ, సాహసగుణమూ వల్లభాయిలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అన్న విఠల్‌భాయియొక్క ప్రతిభాసంపన్నతకూడా వల్లభాయివద్ద విశేషంగానే వున్నది.

కాంగ్రెస్‌లోని గాంధిపక్షీయులకు వల్లభాయి నాయకమణి. అల్లరిపిల్లకాయలైన సోషలిస్టులను బజాయించడానికి కాంగ్రెస్ పార్లమెంటేరియన్‌లచేతిలో పటేల్ మంచిపేము బెత్తం.

చిత్తస్థైర్యవిషయంలో అతనికి అతడేసాటి. పలువత్సరాలకి పూర్వమే అతను ఇంకా ప్రాక్టీసు చేసే రోజుల్లోనే-అతనిచిత్తస్థైర్యాన్ని ప్రబలంగా ప్రస్ఫుటంచేసిన సంఘటన ఒకటి నడిచింది.

ఒకనాడు అతనుకోర్టులో ఒక కేసు వాదిస్తూవున్నాడు. ఆ వాదన మధ్యంలో టెలిగ్రాము ఒకటి అతనికి అందీయబడింది. ఆటెలిగ్రాము విషాదవార్తను కొనివచ్చింది. వల్లభాయిఇల్లాలు మరణించిందనే వార్త! వల్లభాయి టెలిగ్రాము చదువుకున్నాడు. అతని ముఖంమీద విషాదచ్ఛాయలైనా అలము కొనలేదు. నిమీలితలోచనుడైనా కాలేదు. నిట్టూర్పుఅయినా విడువలేదు. నిర్వికారుడయ్యే వున్నాడు. ఏమీ జరగనట్లే తిరిగి యథారీతిని కేసువాదన అందుకున్నాడు. వాదనలో వంపుటొంపు కనిపించలేదు. మామూలు సమయాల్లో అతడు వాదించినట్లేవుంది ఆవాదనకూడా. ఇతరులకు ఎవరికీ ఆవిషాదవార్త అప్పుడు తెలియలేదు. ఆనాడు కోర్టు ముగిసినపిమ్మటకాని ఆవార్త ఇతరులకు అందలేదు. అందరూ పటేల్ ఆత్మసంయమశక్తికి అద్భుతపడ్డారు. నేటికికూడ పటేల్‌కి అటీరిమి, అనిర్వికారత వున్నాయి, కాబట్టే ఇతరులకు అతనంటే అంతభయం; మహాత్మునకు అతనంటే అంతఇష్టం.

# చైనా స్వాతంత్ర్య వీరదంపతుల దినచర్యా కథనము

# చియాంగ్ - మీలింగ్

"యుద్ధం వచ్చినప్పటినుంచీ వాళ్ళకు సంసారసుఖం అసలు లేదు. ఏదేనా వారికి ఇప్పుడు ఆనందం వుందంటే మధ్యాహ్నమందు వారు చేసే పత్రికాపఠనమే."

దేశమును ఆవరించిన దుస్థితి బాగు
వేయాలంటే పీతలమంగాలవంటి నాయకు
ు పనికిరారు. ఒకనియంత వుండాలి.
ఆతడు ఆదేశానికి మహాత్ముడే. అతని
ావభావములే ఆజాతి భావిమార్గము.
ాంతస్థితిలోనుంటే ఎందరేనా పాలింప
చ్చు. యుద్ధసమయాల్లో పదిమంది పా
ించడం దేశ అనర్థదాయకం. నేడు ప్ర
ంచములో నాల్గవవంతు జనాభాకల
చైనాదేశము యుద్ధసాగరమున మునిగి
ది. చైనా జాతీఅనేనావను నడిసముద్ర
ములో భయానక వాతావరణలోనుండి
ట్టి యీడ్చే నియంత చియాంగ్ కైషేకు,
అతనిభార్య అతనికి సహకారిణియై భార
ు కొంత మోయుచు సహధర్మచారిణి
యింది.

చైనాజపాను యుద్ధములో చైనా
ాతికి ఆయువుపట్టు చియాంగ్ కైషేకు.
అతనికి కుడిచేయి అతతిభార్య. వీరి భుజ
ములమీదనే చైనాజాతి భావి సౌభాగ్య
ు ఆధారపడి యున్నది.

ఈ జాతీయభారమును వహించి యు
ుపు టొత్తిడిలో నలిగిపోతున్న ఆదంప
ుల దినచర్య కొంచెం తెలుసుకొనుట
ముచితంకాదా! ఆదంపతుల నిత్యజీవి
తాన్నిగూర్చి క్లుప్తంగా చెప్పాలంటే
సన్యాసులవలె నిరాడంబరమైన జీవితం
గడుపుతున్నారని చెప్పాలి.

ఏయేనియమములు, పద్ధతులు వారికి
శాంతమును, నిదానముగా తమ కార్య
ములను జక్కబెట్టుకొనుటకు సహాయము
నూ చేస్తాయో వాటినే అనుసరిస్తారు.

ఆసర్వసైన్యాధికారి, అతని భార్య
ఎప్పుడూ కలసిమెలసి వుంటారు, తమను
గూర్చిన ప్రచురణఅంటే సుతలాము యి
ష్టములేదు. అట్టివారి అనుచరులలో ఒక
రు వారి దినచర్య యీ క్రిందక్రోడీక
రించినరీతిని వ్రాశారు.

ఆ చైనా సర్వసైన్యాధికారి టంచ
నుగా ప్రతిదినము ఆరుగంటలకు నిద్ర
నుండి లేస్తాడు. 20 లేక 30 నిముషాలు
చురుగ్గా వ్యాయామం చేస్తాడు స్నానం.
తరువాత క్షౌరం. ఏడుగంటలకల్లా భార్య
మందిరానికి వేంచేస్తాడు.

వారిద్దరుకలసి భగవత్ప్రార్థన చే
స్తారు ఏడున్నరవరకు. ఇతరవిషయాలు
ఎంత భారంగావున్నా అది తప్పకుండా
ఆచరిస్తారు.

ఆప్రార్థనకాలంలో చైనాభాషలో
నున్న బైబిలు చదువుతారు. ఆబైబిలు
షాంఘైలోనున్న క్రిస్టియన్ లిటర
ఎసోసియేషన్‌వారు తయారు చేసారు
చదువు అయినతరువాత మోకరించి ప్రా
ర్థించుతారు.

తరువాత చద్ది కుడుస్తారు. ఆభోజన
చాలా క్లుప్తమైనది నిరాడంబరమైనదిన్ని
బియ్యపుఅన్నం, గ్రుడ్లు, కాయకూరల
అతని అప్పటి భోజనపువస్తువులు.

అతడు కాఫీ, టీలను దరిచేరనీయడు
ఆ కొంచెం చురుకును పుట్టించే పా
యాలుకూడా అతనిదేహబలమును, అతడ
మోయవలసిన కార్యభారము చక్క
బెట్టే మెదడు శక్తిని చెరుపుతాయి అ
అతని నమ్మకం.

ఆచద్దిభోజనానంతరం వెంటనే యు
ద్ధవిషయమైన కాగితాలు చూస్తాడు. చక
చకా ఉన్నస్థితిని ఒకసారిగా తనహృ
యఫలకంమీద చిత్రించుకుంటాడు. యి
క ముందుకు ఏరంగాన్ని పోవాలో ఏ
చేయాలో వెంటనే ఉత్తరువులు యి
చ్చేస్తాడు.

ఎనిమిదిన్నర అయేసరికల్లా అతనికై
వేచియున్నవారిని చూస్తాడు. సాధా
ణంగా 20, 30 మంది ప్రతిదినంవస్తారు
పెద్దపెద్ద ప్రభుత్వోద్యోగులు, సైనికా
ధికారులు, అంగరక్షకులు, సలహాదా
రులు, సామాన్యులు- ఆతని ఉద్యోగకా
మును కాస్తా సొల్లుకబురులతో వెళ్ళ
బుచ్చకుండా ముఖ్యమైనవిగా వుంటాయి
ఆ ముచ్చటింపులు.

ఇంతమందితో సంప్రతించాలంటే
గంటలతరబడిని మాటాడటం కష్టం. అం
చేత చైనావారి పాతపద్ధతులు వదిలి

పెట్టాడు—వల్లమందు భాయిగార్ల పద్ధతి—ఆవచ్చిన అతిథి మూడు ముక్కలలో తేల్చాలి అసలు విషయం. అంతే—ఆవిషయం ఏమైనా పెద్దదైతే ఒకరిపోర్టుగా వ్రాసియిచ్చుకోవాలి. సాధారణముగా అతనిని మూడతలచుకున్నవాడు అంతకుముందురోజే ఆరిపోర్టు అర్పించుకోవాలి—పెద్దవిషయాలకే ఆపద్ధతి. ఆరిపోర్టులు కూడా చాటభారతాలుగా వుండకూడదు. అతడు దానికేసి చూడాలంటే అవి క్లుప్తంగా వుండి అవసరమైన విషయములను కలదై వుండాలి. వచ్చినవానితో అయిదు నిముషాలకన్నా ఎక్కువ మాటాడడు.

వచ్చినవారు చెప్పినవిషయాలు అన్నీ శ్రద్ధగా వింటాడు. మంచిచెడ్డలు ఆలోచించి వెంటనే తన అభిప్రాయం యిచ్చేస్తాడు. దానిగూర్చి రాద్ధాంతసిద్ధాంతాలు పెంచడు. పనివుంటే టకటక జరగవలసిందే. యీదర్శనాలలో జరిగేవిషయాలన్నీ ఒకడు రికార్డుచేస్తాడు.

వచ్చినవాళ్ళను పంపివేసిన తరువాత వచ్చిన రిపోర్టున్నీ చూస్తాడు తదనంతరం వార్తాపత్రికలు చదువుతాడు.

వార్తాపత్రికలు చదవడం అంటే అమిత ప్రీతి. చైనాభాషలో వెలువడే పత్రికలను అన్నింటిని చూస్తాడు.

అతనిభార్య అమెరికాలో చదువుకున్నందువల్ల యితరదేశములనుండి వచ్చే దిన, వార, మాసపత్రికలు చదివి వాటిలోనున్న రహస్యములను ప్రపంచస్థితిని వ్యక్తపరుస్తుంది.

దీనివల్ల తనదేశంలో వాటిని భాషాంతరీకరించడంలో వాటిలోవచ్చిన తప్పులు సులభంగా గ్రహిస్తాడు.

మధ్యాహ్నపుభోజనం పంటిగంటకు తింటాడు. ఆసమయంలో అతని సహపంక్తిని కొంతమంది పరదేశ ప్రతినిధులు, పెద్దపెద్ద సైన్యాధికారులు కూడా వుంటూవుంటారు.

అప్పటప్పట పాశ్చాత్యపద్ధతిని భోజనాలు ఏర్పాటుచేసినా సర్వసాధారణముగా సామాన్య చైనావర్తకుని భోజనం లాంటిదే అమర్చబడుతుందా అతిథులకు. నాలుగైదు రకాల పదార్థాలు వుంటాయి. సూపొకటి. ఎక్కువభాగం కాయకూరలే. పాశ్చాత్య దేశాలలో తినే విలువైన 'బేన్‌క్వట్టు' ఆహారం అతని భోజనసామగ్రిలో ఎప్పుడూవుండదు. అతనికి ప్రీతికరమైందల్లా 'పాయి సాయి' దానిని చైనాకేబేజి అంటారు. చాల చౌకఅయింది. చైనాలో అమితంగా ఉపయోగపడేదిన్నీ.

చియాంగ్ కైషేకు చాలామితంగా తింటాడు. ఆ అలవాటే యీయుద్ధపురోజులలోని బరువును మోయునట్లు చేసిందని అతని అనుచరుల వూహ.

తాగుడుఅంటే అతడు పెద్దపులిని చూచినట్లు చూస్తాడు. ఎప్పుడు అతడు తాగుట ఎరుగరు అతని స్నేహితులు.

జన్మదినోత్సవంనాడు మాత్రం కష్టంమీద ఒక గ్లాసు ద్రాక్షపండ్లరసం తాగుతాడుట.

ఆ నిరాడంబరత భోజనంలో నేకాదు. వేషంలోకూడా అంతే.

ఇంటివద్ద చదువుకునే సమయాల్లో సాధారణంగా చైనాదేశీయుడు ధరించే గౌనుధరిస్తాడు. ఇటికి పొడిరంగు అతనికి యిష్టం.

కార్యాలయానికి, సభలకి వెళ్ళే సమయాల్లో ప్రత్యేకతలేని యూనిఫారం వేసుకుంటాడు.

చియాంగ్ కైషేకు భార్య సర్వకాల సర్వావస్థలయందు శుభ్రంగా వుంటుంది.

ఆమెధరించే దుస్తులు అన్నీ చైనావారి పద్ధతిలోనే యుంటాయి. ఆమె తమ స్వదేశవస్తువులనే ఉపయోగించి తన జాతికి ఆదర్శస్త్రీగా నిలిచింది. దానివల్ల యితరదేశములనుండి దిగుమతి ఆయ్యే దుస్తులను వాడకుండా చేయాలని ఆమె వ్రతం. ఆమెకు యితర వస్తువాహనాలు పూజ్యం.

భోజనానంతరం ఒక్క అరగంట నిద్రపోతాడు. తరువాత మళ్ళీ కార్య ప్రవాహంలో యీదులాడతాడు.

తరవాత యుద్ధరంగస్థలములతో నేరుగా సంప్రతిస్తాడు. టెలిఫోనో, టెలిగ్రాఫో, రేడియో ఏకో ఒకటి ఉపయోగించి వారు పంపే ప్రత్యుత్తరాలు విని వెంటనే సమాధానాలు పంపుతాడు భావికార్యాన్నిగూర్చి.

అప్పటప్పట యీసాయంకాలము లందు కార్యకారిణిసంఘసమావేశములకు గాని సైనికసమావేశములకు కాని హాజరవుతాడు. పెద్దపెద్ద సంప్రతింపులు, దర్శినములు వుంటే వాటివిషయంలో తగుమైన జాగ్రత్త తీసుకుంటాడు.

యుద్ధాకాలమునకు పూర్వం సాయంకాలమందు షికారు వెళ్ళేవారు. కాని యీ యుద్ధభారంమూలాన కార్యనిమగ్నులై అది మానేసారు.

రాత్రిభోజనం సుమారు ఎనిమిదిగంటలకు అవుతుంది. మధ్యాహ్నభోజనంలాగే వుంటుంది. తరువాత ఆదంపతులు కబుర్లు చెప్పుకుంటారు. వాళ్ళకువచ్చిన వుత్తరాలు, రిపోర్టులు, పుస్తకాలు చదువుకుంటారు.

చియాంగ్ కై షేకుకి పూర్వకాలమందు జరిగిన యుద్ధములనుగూర్చిన పుస్తకాలంటే శ్రద్ధ. రాత్రిభోజనానంతరం వాదప్రతివాదాలలో కలుగచేసుకోరు. పది గంటలకు పడుకుంటారు. చియాంగ్ కై షేకు కార్యాలలాగే అతనిభార్య మీలింగుకి వున్నాయి ప్రతిదినం.

వాయువిమాన కమిషన్ కార్యదర్శిపదవి వదలినతరువాత యుద్ధములో గాయపడినవారికి, దిక్కులేని బాలురకు స్త్రీలకు సేవచేయడంలో నిమగ్నురాలైంది. న్యూలైఫ్ మూవుమెంటులో స్త్రీ శాఖకు ఆమె ముఖ్యురాలు ఆమె తన ఉత్తర ప్రత్యుత్తరములు స్వయంగానే చూచుకుంటుంది, సమాధానాలు తరచు స్వయంగానే టయిపుచేసి పంపుతుంది ఆమెవ్రాసే వుత్తరాలు చాలావరకు యితరదేశీయులకే.

మధ్యాహ్నకాలమందే ఆమె విజిటరులకు దర్శనమిస్తుంది. తనభర్తలాగే యీమెకూడా అయినా నిముషాలకన్నా ఎక్కువకాలంఒకనితోనే మాటాడుతూ కూచోదు. ఆమెకొరకు యింకా చాలామంది వేచియున్నసంగతి ఆమెకు తెలుసును.

ఏవేనా ముఖ్యవిషయాలను గూర్చి దీర్ఘంగా ముచ్చటించదలచుకుంటే ప్రత్యేకంగా ఒకగంటే వానికొరకు వేరే ఏర్పాటు చేస్తుంది.

యుద్ధమువచ్చినప్పటినుంచి వాళ్ళకు సంసారసుఖం అసలులేదు. ఏదేనా వారికి ఇప్పుడు ఆనందంవుందంటే మధ్యాహ్నమందు వారుచేసే పత్రికాపరనమే.

వారికి యితరదేశాలలో మిత్రులున్నారు. వారిలో డబ్లియు. హెచ్చి. డోనాత్ ఒకడు. అత డొక పత్రికావిలేఖరి.

చీనాదేశ సౌభాగ్యముకొరకు పాటుపడే యితరదేశీయసంఘముల వారితోకూడా వారు పరిచయం కలవారే. అన్యదేశీయులు ఎవరైనా ఆదేశంచూడటానికి వస్తే వారికి ఫలహారాలు అవి యిచ్చే వాడుకకూడా వుంది. ఇది చైనా నల్లమందుభాయిగార్ల దినకృత్యము. నల్లమందు భాయీల నాయకుడయినా అతనిలో ఎక్కడా నల్లమందు మందం కనుపించదు.

# ప్రేమమహత్యం

(గోపాలసింగు, భీమసింగు వర్తకులు. వీరు దూరదేశములకుపోయి విశేష ధనమార్జించుచుండెడివారు. వీరికొక చెల్లెలుండెడిది. ఆమెపేరు విమల. ఆమెకు దాదాపు పదిహేనేండ్లుంటవి. బంగారాన్ని మరపించే దేహకాంతి, సుంద్రని ముఖము, నల్లత్రాచులాంటి జడ ఆమెకు చాల అందాన్ని కూరుస్తుండేవి. వీరియొద్ద రామసింగు అనే గుమాస్తా యుండేవాడు. అతడు చాల నమ్మకముగా పనిచేయుచుండెడివాడు. మంచి రూపసి, సద్గుణ సంపన్నుడు. విమల రామసింగును ప్రేమించింది. రామసింగు కూడ విమలను ప్రేమిస్తాడు. వీరిద్దరు ఒకరినొకరు తప్ప మరెవ్వరిని వివాహమాడకుండునట్లు నిశ్చయము చేసుకున్నారు. ఈవిషయము క్రమేణా విమల సోదరులకు తెలిసింది. వారు తమచెల్లెలికోర్కెను నిరాకరించలేకపోయారు. కాని తమ చెల్లెలు ఒక బీదగుమాస్తాను వివాహమాడటము యిష్టములేదు. కాబట్టి రామసింగును చంపివేస్తే విమల అతనిని మరచిపోయి మరియొకధనవంతుని వివాహమాడునని తలచారు. కాని పాపం కథ అడ్డంగా తిరుగుతుంది.)

అది అర్ధరాత్రి. చీకటి గాడాంధకారముగానున్నది. అట్టి సమయంలో నొక మహారణ్యమందు ముగ్గురువ్యక్తులు ప్రయాణముచేయుచుండిరి. అందొక వ్యక్తి ముందునడుచుచుండెను. తక్కిన యిద్దరు అతని వెనుక యిరుప్రక్కలపోవుచుండిరి. నట్టడవిలోకిరాగానే వెనుకపోవు నిద్దరు వ్యక్తులు ముందున్నవ్యక్తిని చంపేశారు. వెంటనేయతనిని పూడ్చిపెట్టి వారిద్దరు యధాప్రకారముగా ప్రయాణముచేయ మొదలుపెట్టారు.

ప్రాతఃకాలమున సూర్యుడుదయించాడు. ఒక యువతి వాకిట్లో నిల్చుండి యెవ్వరికొరకో యెదురుచూస్తున్నది. ఇంతలో నిద్దరు యువకులు గుఱ్ఱములపై వచ్చారు. రాగానే ఆయువతి 'రామసింగుఏడి' అని అడిగింది. అందులకువారు 'రామసింగు వ్యాపారవిషయమై దూరదేశములకు పోయియున్నాడు. రెండుమూడు నెలలలో వస్తాడు' అని చెప్పారు.

రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడచినవి. కాని రామసింగు తిరిగి రాలేదు. విమలతన సోదరులను 'రామసింగు ఎప్పుడొస్తాడు' అని యెప్పుడడిగినా 'తొందరలోనే వస్తాడు. అవసరపడితే యెట్లా' అనేవారు. రానురాను ఆమెకు తనసోదరులమాటలపై నమ్మకము తప్పిపోయింది. రామసింగు తిరిగి రాడనే అధైర్యము ప్రబలింది. క్రమేణా ఆమెకు మనోవ్యాధి యేర్పడింది. అన్న ఆహారములను విసర్జించి వేసింది. ఆమె సోదరులెంతో ధైర్యము చెప్పేవారు. కాని అవి అన్నియు ఆమెదగ్గర ఫలించలేదు. తమ చెల్లెలిస్థితి చూచి ఆమె విచారమును మాన్పేటందుకు చీరలు, రవికలు, విలువగల ఆభరణములు కొనితెచ్చి యిచ్చేవారు కాని యివన్నియు నామెను సంతోషపరచేవి కావు.

ఒకనాటి రాత్రి విమల నిద్రపోవుచుండగా నామె కలలో రామసింగు కనబడి తన మరణవృత్తాంతము చెప్పాడు. మరియు నామెతోటి 'విమలా నేను నిన్ను గాఢముగా ప్రేమించాను. కడకు నీయన్నలచేతనే చంపబడినాను. నీవు నా సమాధిమీద నీకండ్ల నీటిధార ప్రవాహించేస్తేనేకాని నా ఆత్మ శాంతించదు. నీవీ నాకడసారికోర్కె నెరవేర్చాలి' అని చెప్పి, తాను పూడ్చబడిన తావు మొ[illegible]లైన ఆనవాలు చెప్పాడు. మొదటిదిన[illegible]ము విమల తనకలను నమ్మలేక పోయింది. అదే కల వరుసగా ఎనిమిది దినముల కనబడేసరికి ఒకనాటిరాత్రి కడర్ఘూము[illegible] లేచి రామసింగు కలలోచెప్పిన గురుతు ప్రకారముపోయి గుంటత్రవ్వి చూచింది. అందులో రామసింగుశవము కనబడింది. కాని అవయవములన్నియు విచ్ఛిన్నమై యుండినవి. ఆమె రామసింగు తల తీసికొని ఒళ్ళోనుంచుకొని దానిపై తనకండ్ల నీటిధార ప్రవహింపచేసింది.

అబల, అర్ధరాత్రివేళ లేచిపోయి అ[illegible]రణ్యంలో నొకశవపుతలకాయ ఒళ్లో నుంచుకొని కూర్చున్నదంటే సామాన్యం మా? అంతా ప్రేమమహాత్యం.

విమల అతనితల యింటికి తీసు[illegible] వచ్చి తమ తోటలో నొకప్రక్క పూ[illegible] పెట్టి, అందొక రోజామొక్కను నాటింది. ప్రతిదినము విమలపోయి ఆచెట్టు దగ్గరనిలబడి తనకండ్ల నీటిధార వదలిపెట్టివచ్చేది. ఆమెకండ్ల నీటివలన రోజాచెట్టు బాగుగా పెరిగి చక్కని పూవులు పూయ మొదలుపెట్టింది.

ప్రతిరోజు విమల రోజాచెట్టు దగ్గర నిలువబడి విలపించడ మెందుకో యామె సోదరులకు బోధపడిందికాదు. ఒకనాటి రాత్రి లేచి రోజాచెట్టును పెళ్ళగించి చూచారు. అందు రామసింగుతల కనబడింది. ఇది చూడగానే భయాశ్చర్యము కలిగినవి. వారా తలనెత్తుకొని పారిపోయారు. ప్రొద్దుననేలేచి విమల వాడుకప్రకారము రోజాచెట్టుదగ్గరకు వెళ్ళింది. రాజాచెట్టు పీకి పారవేసియుండటము, రామసింగుతల కనబడక పోవటము చూచేసరికి విమలకు పైప్రాణము పైనే పోయి మూర్ఛపడిపోయింది. ఆమూర్ఛనుండి ఆమె మరెప్పటికి లేవలేదు.

—బాలరచనము.

చివుకుల చెంచుపున్నయ్యశాస్త్రి

## త్రిపురికాంగ్రెస్ నావ–గాంధి సరంగు–ఫెడరేషన్ దిబ్బ రేవు.

# కాంగ్రెస్ కథలు

కాంగ్రెస్ మహాసౌధానికి శంకుస్థాపకుడు డేవిడ్ ఆక్టేవియన్ హ్యూమ్. ఈ వంశానికి మూలపురుషుడు. డబ్ల్యు సి. బెనర్జీ అధ్యక్షుడుగా ఆమహాసభ బొంబాయిలో 1885 లో ప్రారంభమైంది. ఆ సభకు ఆనాడు 'ఇండియన్ యూనియన్'. క్రమంగా 'భారతజాతీయసభ' అని వ్యవహరింపబడుతూ వచ్చింది. 1905 వరకూ, తాంబేలునడక నడిచింది.

... ... ...

1886, 1887 లో కలకత్తాలోని వైస్రాయిగానున్న డఫరిన్ ప్రభువు మదరాసు గవర్నరుగానున్న కనేమరా ప్రభువుల సానుభూతిపొందినది. కాని అది తమ పరిపాలనకు వ్యతిరేకసంస్థగా మారునను వాసన తగిలిన నాటినుండి వారు జాగ్రత్తపడసాగిరి.

... ... ...

1889 లో ఆ సభలలో ప్రభుత్వోద్యోగులు పాల్గొనరాదని నిషేధించింది ప్రభుత్వం.

... ... ...

1905 లో కాంగ్రెసుకు గోఖలే అధ్యక్షుడు. ఆ రోజులలో వంగదేశవిభజన కాంగ్రెస్ కార్యక్రమమునకొక గండమైనది.

1915 లో గోక్లేకి తిలకునకు వ్యతిరేకభావములుండేవి. కాని ఆ సంవత్సరం ఫిబ్రవరి 19-వ తేదీని గోక్లేపండితుడు స్వర్గస్థుడైనాడు. దానితో మితవాదులకు, జాతీయవాదులకు కల స్పర్ధలు పోయినవి, సిన్హా అధ్యక్షుడు. గాంధీని యితరులు ఎన్నుకోకపోయినా అతడు తన అధికారముచే అతనిని విషయనిర్ధారణసభకు సభ్యునిగా చేర్చుకొనెను. అదే గాంధీకి కాంగ్రెసులో కలిగిన తొలిప్రవేశం.

... ... ...

1907 మితవాదులకు జాతీయవాదులకలగిన కలహములచే విడిపోయిన తిలకు తిరిగి 1916 లో కాంగ్రెస్‌లోచేరినాడు. అప్పుడు కూడా మితవాద,జాతీయవాదులకు పోటీలు జరిగినవి. అందులో గాంధీ వొకడు. అతడు ఓడిపోయినా గెలిచినట్టే నన్నాడు.

... ... ...

1917 లో రాష్ట్రీయకాంగ్రెసు సభలు అధ్యక్షపదవికి అనిబిసెంటును ఎన్నుకున్నాయి కాని ఆహ్వానసంఘంలో దానికి ప్రతికూలతేర్పడింది. ఆహ్వానసంఘమట్లు ప్రజల తీర్మానమున తోసివేయరాదని కొందరు వాదించిరి. దానిలో కోపమువచ్చి వైకుంఠనాద్ సేను అనునతడు ముప్పదిమందిఅనుచరులతో సభలోనుండి లేచిపోయెను. ఆయేడు సభకలకత్తాలో జరిగింది.

... ... ...

1919 లో అమృతసరమునందు కాంగ్రెస్ జరిగింప నిశ్చయించిరి. మైకేల్ ఓడయరు పట్టుపట్టి దానిని కాకుండా విశ్వప్రయత్నములు చేసి నానా భీభత్సము కలిగించాడు. డాక్టర్ కిఛ్లూ సత్యపాలు మొదలైన నాయకులను ఎత్తుకుపోవునట్లు ఎత్తులు వేసాడు. అమృతసరము జిల్లామేజస్ట్రేటు యింటికి పిలిపింపబడ్డారు. 10–4–1919 వ తేదీ వుదయం తరువాత వారిని ఎక్కడో దాచివేశారు. జలతైలబిందువైయావార్త వూరంతా పాకిపోయింది. ప్రజలు గోలచేసారు. దానికి విరుగుడిగా కాల్పులు, సైనికశాసనం తాండవించాయి. కాని మోతీలాల్ నెహ్రూ అధ్యక్షత క్రింద జయప్రదంగానే జరిగింది. ఎంతమంది ఆయజ్ఞమునకు ఆహుతి అయినా వెనుతీయలేదు.

... ... ...

1920 సభకు పూర్వం బాలగంగాధరతిలకు మరణము దేశమును విషాదసముద్రములో ముంచినది. ఆసంవత్సరమున అసహాయోద్యమమునకు అనుకూలురు, ప్రతికులురు అను రెండుకక్షలున్నాయి. కలకత్తా కాంగ్రెసునందు లజపతిరాయి

అధ్యక్షతక్రింద ప్రతికూలురు జయమందిరి. తిరిగి నాగపూరులో జరిగిన దానియందు గాంధీతత్వము ఆమోదింపబడినది ఆదినమే సుదినము. ఈ సంస్థయొక్క ఖలీనము హస్తగతం చేసుకున్నాడు మహాత్ముడు.

... ... ...

ఆసభకు చిత్తరంజనదాసు 250 మందిప్రతినిధుల్ని తన స్వంతకర్చులతో తీసుకువచ్చెను. జితేంద్రలాలు కూడా కొంతమంది సిబ్బందిని తెచ్చాడు వారికి ముష్టియుద్ధంకూడా జరిగింది.

... ... ...

1921 లో అసహాయోద్యమం వల్ల అనేకకష్టపరిస్థితులేర్పడినవి. పన్నుల నిరాకరణ, మాప్లా తిరుగుబాటు. జైలులోనున్న చిత్తరంజనదాసు ఆ సంవత్సరం అలహాబాదులో జర్గిగిన సభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. అతనిస్థానమున హకీమ్ అధ్యక్షుడైనాడు.

... ... ...

తరువాత 1922 గయాకాంగ్రెసులోను రెండుభాగాలు ఏర్పడినవి. రాజకీయములకు మతమునకు లంకెపెట్టే రాజకీయతత్వం ఒకటి.అవి కలపకూడదు అనేతత్వంమరిఒకటి. అక్కడేస్వరాజ్యపార్టీకిపునాది. శాసనసభాప్రవేశంఆమోదింపబడినది.

... ... ...

1923లో ఢిల్లీ కాంగ్రెసులోను, కాకినాడ కాంగ్రెసులోను కూడా నోఛేంజర్సుకు ఛేంజర్సుకు పోటీ జరిగింది.

... ... ...

1924 లో మతకలహములు గాంధీ ఉపవాసం. బెల్గాములో గాంధి అధ్యక్షతక్రింద సభజరిగింది. స్వరాజ్యపార్టీవారు పూర్తిగా చీలిపోయి ప్రతికూలప్రచారం సాగించారు.

... ... ...

1925 కాన్‌పూరు కాంగ్రెసులోనుండే అసహాయోద్యమాన్ని ప్రతిఘటించాడు మాళవ్యా పండితుడు.

... ... ...

1926 లో గౌహతి కాంగ్రెసు తీవ్రపరిస్థితులలో తయారైంది. సహాయనిరాకరణమూ సహకారమూ అనే వాదోపవాదాలు బయలుదేరాయి. దానికితోడు స్వామి శ్రద్ధానందుని ఘోరమరణమువల్ల అధ్యక్షుని అంబారీవూరేగింపు ఆగిపోయింది. ఆ సంవత్సరం శ్రీనివాస అయ్యంగారు అధ్యక్షుడు.

... ... ...

1927 రాయల్‌కమీషన్ బహిష్కరణ, గుజరాతువరదలు హిందూమహమ్మదీయ కలహములు. కాంగ్రెస్ మదరాసులో జరిగినది. అన్సారీ అధ్యక్షుడు.

... ... ...

1928 కలకత్తాయందు మోతిలాల్ అధ్యక్షతను జరిగెను. ఆ కాంగ్రెసు జరిగే సమయానికే సైమనుకమీషను ఊడిపడింది. దానిని బహిష్కరించడానికి చేసే ప్రయత్నములో సత్యపాలు, లజపతిరాయి మొదలైన సుప్రసిద్ధనాయకులకు గాయములుతగిలినవి.

... ... ...

1929 లాహూరు కాంగ్రెసు జరిగెను. దానికి ప్రధమంలో గాంధీని ఎన్నుకొనిరి. కాని అతడు ఆ కుటుంబభారము తన యనుచరునకు నప్పగించి పైగావుండి అజమాయిషీ చేయాలనే ఉద్దేశముతో రాజీనామా ఇచ్చాడు. తిరిగి అధ్యక్షునిఎన్నుకొనుటకు లక్నోలో అఖిలభారత కాంగ్రెసు సంఘము సమావేశమైనది. ఆ సభలో చాలా మంది జవహరిలాల్ స్నేహితులగుటచే పటేలు పట్టింట్టగా జవహరు జయమందెను.

... ... ...

లాహూరు కాంగ్రెసు సమావేశసమయమునకు సరిగా వైస్రాయి రైలుక్రింద బాంబు పేలింది. నిర్బంధవిధానం పెరిగి పోయింది. లాహూరు కాంగ్రెసుపైన ప్రళయం తాండవించింది. తమ జీవితముల తృణప్రాయముగా అర్పించడానికి సిద్ధముగానున్న నాయకులందరూ నిరాశతోనే అక్కడకు చేరారు. అక్కడనే కాంగ్రెసు తేదీని మార్చారు.

... ... ...

కరాచికాంగ్రెసు అధ్యక్షుడు ప్రజలచే ఎన్నుకొనబడలేదు. వర్కింగ్ కమిటీవారే ఆపని కానిచ్చారు. ఆసంవత్సరంలో జరిగిన అవాంతరములే వాటికి కారణము.

భగవత్ సింగు ఉరి. అహింసా తత్వవేత్తలుకూడా వారిత్యాగము గుర్తింపకతప్పినదికాదు. వానిరక్షించుటకు గాంధి ఎంత ప్రయత్నించినా లాభంలేకపోయింది. ఆ కరాచిసభకు పటేలు అధ్యక్షుడు. భగవత్ సింగు మరణమునకుతోడు కాంగ్రెసుజరిగే సమయాన కాన్పూరులో సంభవించిన హిందూమహమ్మదీయ కలహమువల్ల గణేశశంకర విద్యార్థి స్వర్గస్థుడైనాడు.

... ... ...

1932 లో కాంగ్రెసును ప్రభుత్వము నిషేధించింది. కాని ప్రజలు పట్టుదలగా సభజరప నిశ్చయించినారు. జరిగేస్థలం డిల్లి. మాళవ్యాను దానికి అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. దేశములో ప్రబలియున్న ఆర్డినెన్సులవల్ల ప్రజలలో అసంతృప్తిగానున్నది అట్టియెడ యిది జరగకూడదని దానిని జరగకుండా చేయాలని దారిలోనే మాళవ్యా పండితుని పట్టివేసింది ప్రభుత్వం. కాని ఢిల్లీ క్లాక్ టవరునందు సమావేశమైనది.

... ... ...

1933 కాంగ్రెస్ ఇదికూడా ప్రభుత్వపు ఆంక్షక్రిందనే జరిగినది ఈసారికూడా ప్రజలు మాళవ్యానే వరించారు. కాని ప్రభుత్వం ఆ పెండ్లి కొడుకును దారిలోనే బందీ చేశారు. కాగా సేన్ గుప్తాగారి సతీమణిని ఎన్నుకొన్నారు. ఆమెకు కూడా నిషేధపు టుత్తర్వు ఇయ్యబడింది. అయినా సభ జరిగింది.

1934 లో గాంధీ కాంగ్రెసు నుండి విరమించుట, బీహారు భూకంపము. బొంబాయిలో జరిగిన కాంగ్రెసును కలతపెట్టినవి. దానికి రాజేంద్రబాబు అధ్యక్షుడు. ఆనాటి కలవరమునకు కారణము సోషలిస్టుల గోదన ఒకటి.

... ... ...

19`6-1937 లలో లక్నోలో జరిగింది. అందులోనే రైటు, లెఫ్టు బేధాలు బయలుదేరాయి. కాంగ్రెసు అధికారమువహించుటకు తీర్మానించినది. జవహార్ లాలు ఏకఛత్రాధిపత్యంసాగింది. కాని గాంధీ తత్వమునకు వ్యతిరిక్తముగా వెళ్ళలేదు. జవహరు అతిశ్రమపడి ఏడు రాష్ట్రములలో కాంగ్రెసుకి అధికారముకూర్చాడు.

... ... ...

1938 లో హరిపుర కాంగ్రెసుకు ముందు రాజకీయ ఖైదీలను గూర్చియు మినిస్టర్ల రాజీనామాలు, సోషలిస్టుల ఆర్భాటములు కలిగాయి. బోసు దానికి అధిష్టాన దేవత.

... ... ...

1939 లో అధ్యక్షపదవికి పోటీ నాయకులలో స్పర్థలు, వర్కింగు కమిటీ రాజీనామాలు, గాంధీ రాజకోట విషయమై ఉపవాస దీక్షా మర్రల కాంగ్రెసులో చీలికలు కలుగనని ప్రజలు కలతచెందారు.

... ... ...

కాని వృద్ధనాయకులంటరూ ఏకమై యువజనుల గొంతుకలు నొక్కివేశా రామహాసభలో. బోసుబాబుని ఎంతనొక్కినా చిత్తు అవలేదంటూ చస్తే నేను యిక్కడే చస్తానుగాని నేను ఎక్కడకుపోనని భీష్మించుకొని ఆ త్రిపురిలోనే కూచున్నాడు.ఏబదిరెండు ఏనుగులచే లాగబడిన రథంమీద అతని చిత్రమే గౌరవంపొందింది కాని అతని కాశోభ అనుభవించే అదృష్టం లేకపోయింది. ఫెడరేషను దిబ్బకై ప్రాకులాడే రాజాజీవంటి ప్రముఖులు దానిని చేర్చే నావికుడు గాంధీజీయే అని తలపోసి పాతనావ అయి చీకి సిద్ధముగానున్న గాంధీ నావే గట్టి దని డబాయించారు. కొత్తగా తయారుచేసినా బోసు నావలో యిన్ని రాళ్లుపడేసి ముంచెత్తేసారు. ఈ పరాభవంతో బోసు ఆరోగ్యం మరింత చెడిపోయింది. వాని అశ్వస్థత చూచి ఈ వృద్ధులు మరింత విజృంభించారు. మొత్తంమీద గాంధీనావే సాగుతోంది. అది ఫెడరేషను దిబ్బవరకు సాగుతుందనుకుంటూ. తరువాత ఏమౌతుందో?

౩౮౦-వ పేజీ తరువాయి.]

రని తెలుస్తూవుంది. వ్యయకర్తనకాంక్షతో అసలు ఈసారి జనాభాలెక్కలు బర్తరఫుచేయడానికి ఇండియా ప్రభుత్వం తలపెట్టింది. కాని పునరాలోచనమీద తుదకు జనాభాలెక్కలు తయారుచేయడానికే తీర్మానించింది. ఆ తీర్మానంలో భాషల్నిబట్టి లెక్కలుతీసుకొనేపద్ధతికి తుదిచీటి ఈయబడింది. భాషల్నిబట్టి లెక్కలు తీసుకోనినాడు ఈసారి జనాభాలెక్కలు తయారుచేయకపోయినా విబ్బందిలేదు. ఫెడరేషన్ నిర్మాణంతోపాటు భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణవిషయంకూడ ఇకమీద రేకెత్తగలదు. రేకెత్తగలదేమిటి, అదేప్రధాన సమస్యకాగలదు. అట్టిసందర్భాల్లో జనాభాలెక్కలు భాషల్నిపట్టి తీసుకోకపోతే ఏమిప్రయోజనం? బెంగాలీ, బీహారసమస్య—ఒరియా; ఆంధ్రసరిహద్దుసమస్య—మహారాష్ట్ర, హిందీ సరిహద్దుసమస్య—ఆంధ్ర, కర్ణాటసరిహద్దుసమస్య—కర్ణాటక, మహారాష్ట్ర సరిహద్దుసమస్య—ఆంధ్రతమిళ సరిహద్దుసమస్య సముచితంగా, సమరసంగా పరిష్కారంకావాలంటే ప్రభుత్వం యాజమాన్యక్రింద భాషల్నిబట్టి జనాభాలెక్కలు క్రొత్తవి తయారుకావాలి. అట్టి లెక్కలికి ఇపుడుఎంతేనా అవసరంవుంది. అవసరంవున్నవానిని తీసుకోడం మానేసి జనాభాలెక్కలు సాగించడం వ్యర్థవ్యయమౌతుంది. భారతశాసనసభాసభ్యులు ఈ విషయంలో తగుమైన ఆందోళనసాగించి ప్రభుత్వం తన తలపునుమార్చుకొని ఈ సారి జనాభాలెక్కల్లో భాషల్నిపట్టి లెక్కలు తయారుచేసేటట్లు చేయాలి. అట్లు చేయనినాడు ఈసారి జనాభాలెక్కల వ్యయంఅంతా వ్యర్థవ్యయమే ఔతుంది,—

**౬. బియ్యపు దిగుమతి అరకట్టనే లేమా?**

ఒక్క జనరిమాసంలో బర్మానుంచి 13,542 టన్నుల బియ్యము, 7967 టన్నులధాన్యమున్నూ—సయాంనుంచి 64 టన్నులబియ్యమున్నూ హిందూదేశానికి దిగుమతిఅయ్యాయి అని కేంద్రశాసనసభలో ప్రభుత్వసభ్యుడు ప్రశ్నోత్తరకాలంలో ప్రకటించాడు. ఈదిగుమతులమూలంగా మదరాసుకోస్తాలో ధాన్యం ధరలు, బియ్యంధరలు తగ్గిపోయాయి అనికూడా ప్రభుత్వసభ్యుడే ప్రకటించాడు. మదరాసురాజధాని వపంటకు మోరుమోసింది. అట్టిరాజధానికి బర్మా, సయాంవంటివిదేశాలనుండి ధాన్యమూ, బియ్యమూ దిగిమతి చేసుకోవలసినంతగతి ఎందుకుపట్టింది? ఈ దిగుమతి మదరాసుకుగల అక్కరనుపట్టికాదు. బర్మా, సయాంలలో వరిపంటహెచ్చు కాబట్టి ఆదేశాలు ఎగుమతిచేస్తున్నాయి. మనకు నిరోధించుటకు శక్తిలేదు కాబట్టి ఆదేశాలధాన్యం, బియ్యం మనదేశానికివచ్చి పడుతున్నాయి. ధరతగ్గితే రైతుచెడతాడు. రైతును రక్షిద్దామనే ఉద్దేశంవుంటే మనప్రభుత్వం ఈసరికి ఈదిగుమతిని అరికట్టేవుండును,

**౭. రాజాజీకి జాతీయపతాకమంటే అభిమానం లేదు:—**

కారైకుడి మునిసిపల్‌సంఘం ఆవూరిలోని బీటుకానిస్టేబుల స్టాండ్సుమీద జాతీయపతాకాల్ని ఎగరవేయడానికి తీర్మానించింది. ఆ తీర్మానాన్ని ఆ చరణలో పెట్టడానికి అనుమతికోరుతూ, మద్రాసుపోలీసు శాఖామాత్యులైన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాచార్యులవారికి పంపారు. వారు చక్రవర్తులవారుకదా కాగా వారు చక్రవర్తిసామ్రాజ్యరక్షకులై చక్రవర్తియొక్క పోలీసువారితలలమీద జాతీయపతాకం ఎగరవేయకూడదని తాఖీదుపంపాడు. జాతీయమహావీరుడైన మహాత్మాగాంధి ముఖ్యానుచరుడు, ముఖ్యబంధువు అయిన రాజగోపాలాచార్యులవారు తమవశమైఉన్నప్రభుత్వశాఖలో జాతీయపతాకాన్ని ఇట్టి నిషేధాజ్ఞతో గౌరవిస్తున్నారు. రాజాజీకి సామ్రాజ్యతత్వంఒంటపట్టిందని ప్రతికక్షులు పరిహాసంచేసారంటే ఇకతప్పేముంది?

Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.